# ఇక్కడ ఎవరైనా ఒకటే

(సాహితీ సిరికోన వాక్స్థలి పత్రికలో ప్రచురితమై
'శ్రీమతి ఆసూరి మరింగంటి సులోచనారంగాచార్య' స్మారక
సిరికోన ఉత్తమ కవితా పురస్కార విజేత కావ్యం)



స్వాతీ శ్రీపాద

**IKKADA EVARAINA OKATE**
**Swatee Sripada Kavithalu**
***(Siricona Samarpana)***

*First Edition:* June, 2021



*Address :*
**Swatee Sripada**
16/2/701/D/2, Lakshmi Nilayam,
Anandnagar Colony,
Malakpet, Hyderabad - 500 036.
Mob: 82972 48988
swatee53@gmail.com

*Copies:* 500

Price : 150/-

*Book Designing & Production:*
**JV Publications: Jyothi Valaboju**
jyothivalaboju@gmail.com

*Cover Design:*
**Bangaru Brahmam**

*DTP & Type Setting:*
**K. Ravi Prabha**,
Mob: 93999 32729

*Printed at:*
..............................

*for Copies:*
..............................

# ఇక్కడ ఎవరైనా ఒకటే!?
# కానీ ఈ కవయిత్రి కాదు

**2020** సంవత్సరానికిగాను మా సాహితీ సిరికోన వాక్స్థలిలో వచ్చిన ఉత్తమ కవిత్వానికి గాను మా అమ్మగారి స్మృత్యంకితంగా నెలకొల్పిన 'శ్రీమతి ఆసూరి సులోచనా స్మారక సిరికోన' పొయెట్రీ అవార్డును స్వాతీ శ్రీపాదగారు అందుకోవడం నాకెంతో ఆనందకరంగా ఉంది. వారు ఈ తరం ఉత్తమ కవయిత్రి. ఏడాది పొడుగునా సిరికోనలో అద్భుతమైన కవిత్వం రాస్తూ వచ్చారు. వారి కవిత లేని రోజు అరుదు. అలానే ప్రతి కవితలోనూ అరుదైన పదచిత్రాలు, అద్భుతమైన మెరుపులు. ఆ మెరుపుల్లో, వారే ఎంపిక చేసిన 70 కవితల సంపుటి ఈ 'ఇక్కడ ఎవరైనా ఒకటే!'.

ఇందులోని మొట్టమొదటి కవితలోనే చెప్పినట్లు –

'నిన్నటికీ నేటికీ మధ్య ఊగిసలాటలో ఆజన్మాంతం సాగే 'అల్లిక''

– శ్రీమతి స్వాతీ శ్రీపాద కావ్యప్రపంచం.

అది వాస్తవిక ప్రపంచానికి ఒక అధివాస్తవిక మార్మిక ప్రతిబింబం.

ఆ ప్రపంచం వైపు దృష్టి తిప్పామంటే అది 'లోలోనికి లాగేసుకొంటూ వెయ్యి అలల చేతులతో చుట్టుముట్టిన సముద్రం'లా ఉంటుంది, అందంగా, అర్థం కానంత గంభీరంగా, మన గుండెల్లోని అవ్యక్త ఘోషకు, అన్వేషణకు కళాత్మక ప్రతిరూపంగా!

ఆ కళాత్మక 'తాత్త్విక కాల్పనికతే' శ్రీమతి స్వాతిగారికి వర్తమాన సాహిత్య ప్రపంచంలో ఒక విశిష్టమైన అనుపమ స్థానాన్ని సంపాదించి పెడుతోంది.

అందులోనూ వారి ఇంతకు మునుపటి సంపుటాలన్నీ ఒక ఎత్తు. ఈ సంపుటమే ఒక ఎత్తు. ఇందులో ఆమె మరింత లోతుగా తనలోకి తాను వెళ్తూ, మునుపటి కంటే ఉన్నతమైన ఎత్తులను అందుకున్నారు. కాల్పనిక భావుకత, తాత్త్విక భావుకతగా పరిణమించింది. స్వాప్నిక వియోగం మార్మిక అన్వేషణగా పరిణమించింది.

ఈ పంక్తులను చూడండి:

'పొగమంచు కమ్మేసిన చూపుల మధ్య
అలుక్కుపోయిన చిత్రాల్లో చూపు మందగించినా
ఒక స్వర్గసీమను వెతుకుతూనే ఉంటుంది...'
(...చివరి అంచున...) అన్న కవయిత్రే
'ఇక్కడ ఆత్మలకు దేహాలు ఒట్టి అలంకారమే...
...యుగయుగాలుగా ఎదురుచూసే ఆత్మలన్నీ
దారి వెంట కలుస్తూనే ఉంటాయి
ఒక గంటో ఒక రోజో ఒక జీవనకాలమో

ఋణానుబంధరూపేణా...' అంటున్నారు. ఆ 'ఋణానుబంధ రూపేణా...' అనే కవిత - అదొక్కటే అన్న మాటేమిటి?- ఎన్నో కవితలు ఆసాంతం ఉన్నట్టుండి చిన్న, చిన్న మాటల్లోనే వేదాంతపు లోతుల్ని చవిచూపిస్తాయి...

'సుదీర్ఘమైన శ్వాస చివర
రెల్లుపూల కొమ్మై నర్తించే విభ్రమమొకటి ఎరుగుదురా?' అంటూ మనల్ని ప్రశ్నిస్తూ, ఆ అపూర్వ పదచిత్రాలతో చూపిస్తూ చకితుల్ని చేస్తుంటాయి.

స్వాతిగారి 'కవిత' అనగానే చక్కటి, చిక్కటి సాహిత్యం, లయ, ఉపమానాలు, సున్నిత పదచిత్రాలు మనస్సులో మెదులుతాయి... కవి (హృదయం) చెప్పాలనుకున్నది - చదువరుల భావనకు వదిలినది - కలగలసిన కవితలు చదివిన ప్రతిసారీ క్రొత్త అనుభూతుల్ని కలిగిస్తాయి.

'కనిపించని ఊలుదారాలతో జీవితం ముడులల్లుతూ..

సముద్రం సెలయేరుగా మారినట్టు' చేస్తుంటాయి... ప్రతి మాటలో ఆమె 'దర్శనం' కనబడుతూ, ప్రకృతిలో మనిషి, మనసు ఒక భాగమేనని పదే, పదే గుర్తు చేస్తాయి... ఈ మాటల్ని చూడండి:

'నేలకు వాలుతున్న
తేలికపాటి మబ్బులు
పెరట్లో నాటుకున్న కలలు
ఎక్కడ భద్రంగా కాలాన్ని కప్పుకున్నాయో కాని
ఈదురు గాలి మధ్య రెపరెపలాడే శాలువ కొసల్లో
చిటికెన వేలట్టుకు ఊగే
అల్లరిపిల్లలవుతాయి." (... సాయంసంధ్య) ... చదువుతున్న వారి వేలు పట్టుకొని కాలం ఒడ్డులో నడిపిస్తున్నట్లుంటాయి...

ఆమె కవితలు మనస్సు లోతుల్లోంచి వచ్చిన భావతరంగాలు. ఆశా దైన్యాలతో నిత్యం ఊగిసలాడే మనస్సు గుసగుసలా వినిపిస్తాయి.

పుస్తకం శీర్షికగా మారిన కవితలోని ఈ ముక్తాయింపు మాటల్లోని తాత్త్విక సౌందర్యం, భావసాంద్రత చూడండి:

'నువ్వూ నేనూ అపరిచితులమేనా?
...
ఒక్క క్షణం ఆగి
లోలోపలి లోతులను కొలుచుకుంటే
నువ్వూ నేనూ ఒక్క చోటే ఆగిపోతాం
...
ఇక్కడ ఎవరైనా ఒకటే
ఒకరిలో ఒకరు కనిపించే అద్దాలే!'
(...ఇక్కడ ఎవరైనా ఒకటే)

❖ ❖ ❖



ఈ ఏడాది శ్రీమతి స్వాతీ శ్రీపాదగారికి ఈ అవార్డు ప్రకటించి నప్పుడు చెప్పిన మాటలు:

శ్రీమతి స్వాతి శ్రీపాదగారి కవిత్వంలో నాకు నచ్చిన అంశాలు – సున్నితమైన భావవ్యక్తీకరణ, అందులోని ప్రతీకాత్మకత, ఆ భావాల్లో ధ్వనించే నవ్యత – వీటిని ప్రధానంగా పరిగణిస్తూ, ఈ అవార్డును ప్రకటిస్తున్నాము.

ఈ పురస్కార నిర్ణయంలో, మునుపటి సంవత్సరం పురస్కార స్వీకర్త, మధురకవి శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు కూడా భాగస్వాములుగా ఉండడం ఎంతో ముదావహం!

మా అమ్మగారి (స్వర్గీయ శ్రీమతి సులోచన) స్మృతిలో, ప్రతి యేటా ఉత్తమ సాహిత్యాన్ని సన్మానించుకునే అవకాశాన్ని, అదృష్టాన్ని కలిగించిన సాహితీ సిరికోనకి, ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ గారికి ధన్యవాదాలు తెలుపుతూ, శ్రీమతి స్వాతీ శ్రీపాదగారిని అభినందిస్తూ, శలవు!

– **వేణు ఆసూరి** (కాలిఫోర్నియా)



# నామాట

**సి**రికోన ఆత్మీయులంతా రసహృదయులు.

కవిత్వం రాయడం ఒక ఎత్తైతే ఆస్వాదించే తత్వం పదింతలు ఉన్నతమైనది. నా ప్రతి కవితా రాయించిన మిత్రులు సిరికోన రస హృదయులే. అందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు.

పోటీలూ బహుమతులూ నిమిత్తమాత్రం. అయినా ఎంపిక చేసి స్మారక పురస్కారం ఇచ్చిన వేణూ ఆసూరిగారికి, గంగిశెట్టి లక్ష్మీ నారాయణగారికీ , బులుసు వెంకటేశ్వర్లుగారికీ బహుదా వినమ్ర వందనాలు.

సిరికోనలో నేను ఎక్కువగా స్పందించకపోయిన చదివి ఆనందించే ప్రతి వారికీ చేతులు జోడించి నమస్కరిస్తున్నాను.

ఈ పుస్తకం సిరికోన మిత్రులకూ, వేణూ ఆసూరిగారి అమ్మగారికీ అంకితం.

చక్కని ముఖచిత్రం అందించిన బంగారు బ్రహ్మంగారికి, పుస్తకం పని సమస్తమూ చూసిన జ్యోతి వలబోజుకూ ఏమిచ్చినా తక్కువే.

మీ ఆదరాభిమానాల్లో ఎప్పుడు ఉండాలని

మీ

**స్వాతి**



# ఇందులో...


| | | |
|---|---|---|
| 1. | అల్లిక... | 11 |
| 2. | మౌనం శరణం గచ్ఛామి | 12 |
| 3. | అభయం | 14 |
| 4. | చిటికెడు... | 16 |
| 5. | సముద్రం సెలయేరై... | 18 |
| 6. | చూపులు ఆకాశానికి తగిలించి... | 20 |
| 7. | చిరంజీవి | 22 |
| 8. | సతతహరితం | 24 |
| 9. | ప్రేమ | 27 |
| 10. | తెలీదు కదా, ఎవరికి మాత్రం ఏం తెలుసు? | 28 |
| 11. | అన్ని సమయాలూ... | 31 |
| 12. | నడక | 33 |
| 13. | అనిపిస్తుంది | 35 |
| 14. | ఋణానుబంధ రూపేణా... | 37 |
| 15. | ఉన్నట్టుండి... | 38 |
| 16. | ఇక్కడ ఎవరైనా ఒకటే... | 40 |
| 17. | అనుకున్నా.... | 42 |
| 18. | ఏదైతేనేం? | 44 |
| 19. | శిశిరపు చార | 46 |
| 20. | అక్షరాన్ని కదా... | 48 |
| 21. | అప్పుడే కదా మొదలు | 50 |
| 22. | కొంచం మారి... | 51 |
| 23. | మాట పదిలం | 52 |
| 24. | రేపటి కల | 53 |

| | | |
|---|---|---|
| 25. | ఆగి ఎదురుచూడండి | 55 |
| 26. | వాతావరణం | 57 |
| 27. | ఇక్కడే, ఈ మనుషుల మధ్యే... | 58 |
| 28. | రెండు కాళ్ళు నేలను తాకగానే... | 60 |
| 29. | అదృశ్యంగా... (అర్ధరాత్రి) | 62 |
| 30. | చివరి అంచున... | 64 |
| 31. | సాయంసంధ్య | 65 |
| 32. | మాటలు దొరకవు | 67 |
| 33. | చాలా రోజులు ఇలాగే ఉంటాయి | 69 |
| 34. | ఇక్కడ కూడా ఒక సముద్రం పరచుకుని ఉంది | 71 |
| 35. | పయనం | 73 |
| 36. | కిటికీ పక్కన... | 74 |
| 37. | పునరుజ్జీవన | 76 |
| 38. | మనకూ మనకూ మధ్యన... | 78 |
| 39. | కలగంటి... | 80 |
| 40. | ఒక రోజున.. | 82 |
| 41. | ఇచ్చి పుచ్చుకోవాలి | 84 |
| 42. | చాలా రోజుల నుండీ... | 86 |
| 43. | తరతరాలుగా... | 88 |
| 44. | ఇంకా సజీవంగానే వుంది | 90 |
| 45. | భాషే కావాలా? | 92 |
| 46. | యుద్ధం ఆరంభమైంది | 94 |
| 47. | వాళ్ళిద్దరూ... | 97 |
| 48. | గప్ చుప్! | 99 |
| 49. | తెలిసీ తెలియక... | 101 |




| | | |
|---|---|---|
| 50. | ఎందుకు ప్రతిదీ ఒక నటనే ఇక్కడ? | 103 |
| 51. | నువ్వేమిటి? | 105 |
| 52. | ఎన్నిసార్లో... | 107 |
| 53. | ఇల్లు నిశ్శబ్దంగానే ఉంది | 108 |
| 54. | లోకం తీరు | 110 |
| 55. | ఈ రాత్రి | 112 |
| 56. | ఈ వసంతం | 114 |
| 57. | మాటలు | 115 |
| 58. | నా దేశం | 116 |
| 59. | ప్రశ్నార్థకం | 119 |
| 60. | నాగరీకులు | 121 |
| 61. | ఆమే... | 124 |
| 62. | మాట | 127 |
| 63. | నిశ్శబ్దంగానే ఉంటాను | 129 |
| 64. | ఏ రోజు కారోజు | 131 |
| 65. | స్వప్నసౌందర్యం | 133 |
| 66. | వసంతానికో దారి | 135 |
| 67. | ఎక్కడా ఏవీ కనిపించవు | 137 |
| 68. | జవాబు లేని ప్రశ్న | 139 |
| 69. | లేనితనం | 141 |
| 70. | నువ్వు | 143 |

# అల్లిక...

ఎన్ని సందిగ్ధాల మధ్య ఎన్ని అయోమయాల మధ్య
ముందుకు వెళ్తూ వెనక్కు నడుస్తూ
కాస్సేపు ఎగబాకి అంతలోనే కాస్త దిగజారి
దిక్కులు చూస్తూ అల్లుకున్న
అందమైన వెండిపోగుల సాలెగూడు ఇది.

కలవరపాటై ఎదురుచూస్తున్న చూపుల మధ్య
లేత వెలుగుల అభిషిక్తంలో గాలి సయ్యాటల సరాగాల మధ్య
ఆలోచనల నీడల మధ్య మరెన్ని వ్యూహాలు అల్లుకుంటూ
గూటి మధ్య గుడ్లప్పగించిన ఉనికి.

చుట్టూ నర్తిస్తున్న ఎండమావులూ, నీరెండ వెలుగుల మధ్య
సప్త వర్ణాల్లో ప్రపంచాన్ని ఒడిసి పట్టుకున్న గూడది.
కాళ్ళ కింద సైకతవనాలను కబళిస్తూ
లోలోనికి లాగేసుకుంటూ వెయ్యి అలల చేతులతో
చుట్టుముట్టిన సముద్రం అది.

ఎవరి చుట్టూ వారు వెలుగుల భవనమో
వెన్నెల వెలుగుల వెండి మందిరమో
స్వర్ణకాంతుల ప్రపంచమో కట్టుకున్నా
మస్తిష్కం నిండా క్షణం తీరిక లేకుండా
నేతగాళ్ళై అల్లుతున్న ఆలోచనల సాలీళ్ళు

ఆజన్మాంతం అల్లిక సాగుతూనే ఉంటుంది
నిన్నటికీ రేపటికీ మధ్య ఊగిసలాటలో...



# మౌనం శరణం గచ్ఛామి

సగం సగం తొణికిన భావోద్వేగాలు
అప్పుడప్పుడు రాలి పడుతూ ఉంటాయి
ఒణికే చేతులు జారి మధుపాత్ర పగిలిన శకలాలుగానో
నడిరాత్రి జుట్టూ జుట్టూ పట్టుకున్న చుక్కల ముక్కలుగానో
పక్కకు తప్పుకుని నడవాలి తప్ప
పదునుదేరిన మాటలపై అడుగులు వేస్తే
గాయపడేది మరెవరో కాదు గదా!

నిద్రలోనూ మెలకువలోనూ
సూర్యచంద్రులను పెరట్లో రాటకు
కట్టేసుకున్నట్టే ఉంటుంది.
స్వప్నసీమల్లోనే వెన్నెల మైదానాలూ
నీరెండ స్వర్గాలూ జలతారు పరదాలై
అలవోకగా కదులుతాయి
నిజానికి
పుష్యమాసపు మంచుసూదుల్లా
దోమకాట్లూ
రోహిణీ కార్తె అగ్నిపర్వతపు లావాలో సెగలూ
అవే కదా పలకరింత వెనక దాగిన మిన్నాగులు

అలసిపోయాను పూర్తిగా
రంగులు లేకుండానే రోజు రోజూ చూసే నాటకాలకు

కలుపు మొక్కలైనా పిచ్చిపూలు పూస్తూ
కల్పవృక్షాలనుకునే గుడ్డిగవ్వల వాచాలతకు
గుండె గొంతుకలోకి వస్తుంది
నిలదీసి నిజాయితీని ప్రశ్నించమని
కాని
మాట్లాడాలని లేదు
మౌనం శరణం గచ్ఛామి!





# అభయం

ఇప్పుడు తలుచుకుంటే నవ్వొస్తుంది.
మనసుకైనా నీలాకాశానికైనా
ముసురుపట్టిన రోజుల్లో
ఉరుము ఉరిమితే చాలు
పిడుగు మీద పడ్డట్టే భయం వేసేది.
లోపలా బయటా రంగుల మెరుపులన్నీ అదృశ్యమై
తెరలు తెరలుగా చీకటి వంద ఛాయల్లో
రాంప్ వాక్ చేసేది.

ఎదురైన వాటన్నింటినీ ఎడపెడా బాదుతూ
తాళం వేస్తున్న గాలిరొద
మెలితిరిగి మెలితిరిగి
సుడిగాలై దొరికినవన్నీ వెంటేసుకుపోతున్న
మాయలాడిగా మారినప్పుడు
అమ్మో!
నన్ను ఏ లోకానికి ఎగరేసుకు పోతుందోనని
భయం వేసేది.

పైనుండి పెద్దపెద్ద గొట్టాలతో వదిలినట్టు
ఏనుగు తొండమంత ధార
చూరును వణికిస్తున్న వేళ
నిద్రలో నీరంతా చేరి
ముంచేస్తుందేమోనని

ఉలికిపడేది మెలకువ
ఇప్పుడు నవ్వొస్తుంది.

ఎన్ని ముసుర్లు ఎన్ని పిడుగులు
ఎన్ని ముంపులు ఎన్ని వరదలు
అయితేనేం,
గంటకో ఘడియకో రోజుకో
వారానికో
ఎదురుచూస్తూనే ఉండేది కదా తెరిపి
ఏమీ జరగనట్టు ఎప్పటిలా
అటు కళ్ళెదుటా ఇటు లోలోపలా
మామూలైపోతుంది.
ఇప్పుడిక ఏ క్షణమూ భయాన్నివ్వదు
తప్పని చివరి క్షణానికి
అభయం తప్ప!





# చిటికెడు...

గోరువెచ్చని కాంతిపుంజాలు
వడబోసిన కిటికీ గాజు తలుపుల్లోంచి దూరి
మూసిన కనురెప్పల మీద
చీమలబారులా పాకుతాయా
ఇంకా వెలుగు చూడని కనుల నిండా
క్షణంలో మొలుస్తుంది
వెదురుకొమ్మలా నీ రూపం.
చెల్లాచెదరుగా పడి ఉన్న స్వప్నశకలాలను
ఏర్చి కూర్చి కలబోసుకుంటూ
కార్యక్రమాలు క్యూ కడతాయి.
నిండుకుండ కూడా తొణికినట్టు
నిశ్శబ్దంగానే తొణికిసలాడతాయి పదాలు.

నాతోపాటే పనిపాటల్లో పాలుపంచుకుంటూ
పదబంధాలు పల్లవిస్తాయి.
ఆషాఢమాసం నాట్లు వేస్తున్న మొలకలై
నునులేత హరితాన్ని పోగేసుకుంటాయి
బళ్ళకెత్తే ధాన్యపు సంచులై బరువుగా వేళ్ళాడతాయి.

ఉడుకుతున్న అన్నంతోపాటు అర్థంకాని ఉద్వేగంతో
కుతకుత లాడుతాయి ఒక్కోసారి
ఆవేశాన్ని భళ్ళున విసిరికొట్టి పగిలిన గాజుముక్కలవుతాయి.

అపరాహ్ణం కోడికునుకులోనూ
అరక్షణం కలల ఊయలలవుతాయి.
వసంతపు మునిమాపువేళ
సగం విరిసిన సన్నజాజి పరిమళాలై
సౌరభాలను ప్రవహిస్తాయి.

నలుసంత ఆశతో నడిరాత్రి
తెల్లకాగితం వేదికనెక్కి అనుభవాలు పంచుతాయి
చిటికెడు జీవం ఆకాశమయి విస్తరిస్తుంది.





# సముద్రం సెలయేరై...

వెలుగూ లేదు వెన్నెలా లేదు
మసక చీకట్లైనా మంచు కురిసే వేళ అయినా
చినుకులు చినుకులుగా రాలిపడే పూలవెంట
నాలుకపై క్షణంలో కరిగిపోయిన బాల్యం వెంట
పరుగులు తీసిన రోజులు
ఆకాశంలో మొలిచిన తారలు గదా.

గచ్చకాయల ఆటలో
ఉన్నట్టుండి ఆకాశానికి ఎగిరిన
ఒక పాలరాయిలా
అప్పుడప్పుడూ
ఎప్పుడో ఒకసారి అన్నట్టూ
ఉదయపు తూర్పు మేఘాల మధ్య కనిపించే
తోకచుక్కలూ
ఒంగి నేలను తాకాలని ఉవ్విళ్ళూరే
నీటి హరివిల్లూ
అక్కడ ఆ గోడ మీద
ఇంకా తగిలించి ఉన్నాయి పాతకాలపు ఫొటోల్లా.

ఎన్ని వేకువలో అహ్వానించని అతిథులై
వస్తూ పోతూనే ఉన్నాయి
జడ చివరలు విప్పుతూ అల్లుతూ

కనిపించని ఊలుదారాలతో జీవితం ముడులల్లుతూ
వెలిసిపోయిన రంగులకు మరోసారి
నవ్వులను అద్దుతూ
కాలం వేలట్టుకు నడిపిస్తూనే పోతుంది
పరుగు నడకై నెమ్మదిస్తుంది
సముద్రం సెలయేరుగా మారినట్టు.





# చూపులు ఆకాశానికి తగిలించి...

సాయంత్రమయేసరికి,
సమయానికి అమ్మ పొదుగుకోసం
తల్లడిల్లే లేగదూడలా
రంగులు పులుముకున్న మబ్బులతో పోటీకి దిగుతూ
గాలిపటమై దూసుకువెళ్ళేది మనసు
పైపైకి ఎగురుతున్న తెల్లమబ్బు రెక్కలను వంచి చుక్కలు దాటి
మాంత్రిక లోకాన విహరించాలన్న కల.
టపటపమని రెండు చినుకులు
ఎవరు చల్లారో కాని
చటుక్కున పాలపొంగు ఉత్సాహం అణగారి
తడిసి రాలిపడే గాలిపటాలకై పరుగులు

పరుగుల సందడిలోనో గడచిపోయిన గతం
అందినట్టే అంది చేజారిపోయిన దారపు కొసలా
వంగినట్టే వంగి మళ్ళీ పైపైకి దూసుకెళ్ళిన
తెగిన గాలిపటంలా  గెలుపు ఓటములు
అప్పుడూ ఇప్పుడని కాదు
ఎప్పుడూ ఇదే కథ
అంతులేని కథ

కాకుంటే రంగులద్దిన కోరికలూ ఊహలూ ఎగరేస్తూ ఉంటాము
ఎగిరినట్టే ఎగిరి ఏ ముళ్ళకొమ్మల చేతుల్లోనో చిక్కుతాయి కొన్ని.

ఆ దా(ధా)రం తెంచుకు అనంత నీలిమలో విలీనమవుతాయి కొన్ని
తడిసిముద్దై వెనక్కు వచ్చి పదిలంగా గుండెగూట్లో ఒదిగిపోతాయి కొన్ని
కొన్నింటిని స్మరిస్తూ కొన్నింటిని విస్మరిస్తూ
మరికొన్ని సంస్మరిస్తూ ఇక్కడే...
చూపులు ఆకాశానికి తగిలించి ఎదురుచూపుల్లో...





# చిరంజీవి

ఎంత లోలోనికి తోసేసినా
తొంగిచూస్తూనే ఉంటాయి
అద్దాల వెనక నుంచి అద్దకపు ముద్దరలు
పలచని చూపుల మధ్య పరచుకోని పరిమళాలు
పుట్టుకతో మోసుకువచ్చిన పురావాసనలు
అట్టడుగు పొరల్లోకి చేరి అదిమిపెట్టిన శిలాజాలైనా
క్షణానికో పత్రమో పుష్పమో పరామర్శో పన్నీటి జల్లో
పొరల మధ్య ఇష్టంగా పేరుకుంటూ పేర్చుకుంటూ ఉంటాయి.
రోజులూ నెలలూ ఏళ్ళకేళ్ళు ఎక్కడివక్కడ అణిచేసి ఉన్నా
అడక్కుండానో అగరుపొగల్లా ఉన్నట్టుండి ఉక్కిరిబిక్కిరి చేస్తూ
అల్లుకుపోతూ అలుముకుంటాయి.
వాటి ఆయువు ఏ కాంతి సంవత్సరాల్లోనూ కొలవలేము.
నిద్రలో పలవరిస్తున్నట్టు నీటిపైన అలలవుతాయి.

ఊపిరి పీల్చినంతసేపూ మళ్ళీ మళ్ళీ
రీఛార్జ్ అవుతూనే ఉంటాయి.
ఈ సూపర్ బాటరీకి ఉనికే గొప్ప ఆయుష్షు.
కాస్సేపు నిద్రలోకి జారుకున్నా దిగులు మేఘాలు దిగివచ్చి
చుట్టూ కమ్ముకుంటాయి.
ఆగిపోయిన గుండె
కుదిపి కుదిపి మేల్కొలుపుతాయి.
విప్పలేని కనురెప్పల అలసటలో
స్వప్నసీమలై చేరతాయి

గాలివానై వణికించే ఒంటరితనంలో
వెచ్చని రజాయిగా మారి చుట్టుకుంటాయి.
బీడువారిన పొలాలు అనుకున్నప్పుడు
సతతహరితపు కలలను సాగుచేస్తాయి.
వాడిపోయిన పూరెమ్మల మధ్య
ఒదిగిన పరిమళాలను
పదేపదే పదిసార్లు వెదజల్లుతాయి.

ఏకాంతపు సమూహాన ఒక్కో క్షణం వెనక్కు వెళ్ళినప్పుడు
పరిచయమైన పరిభాషలు రాలిన సుమ సౌరభాలవుతాయి.
ఋణానుబంధం అనేది ఒక్క రోజో ఏడాదో వందేళ్ళో కాదు
అజరామరంగా మరొకరి జీవనకాలం
గుండె మీద పరచుకుని గుక్కెడు కాలాన్ని
పుక్కిటపట్టే యోగం
మరణమూ చితి జ్వలనమూ కాదు చివరి క్షణం
ఏదో ఒక హృదయాన స్పందిస్తున్న వరకూ
చిరంజీవులే.





# సతతహరితం

లెక్కేసుకుందుకు చుక్కలు కూడా సరిపోవు మరి
ఎన్ని వేల కాంతి సంవత్సరాలుగానో
తేనె తలపుల్లో ఊరి ఊరి మధురమైన ఊహలు ఇవి
మధుమాసాలు నిచ్చెనగా అమర్చుకు
నీలాకాశం అనంతమై నాలో పల్లవించిన క్షణాలు మరి.

పచ్చపచ్చని పూపొదరిళ్ళు రెక్కలు వచ్చిన చిలుకలై
ఎగురుతున్నట్టు వెచ్చని పలుకుల పలకరింపు
ఎంతో నచ్చిన నీరెండ వెలుగులో ముళ్ళ గోరింట
పూలవాన పసిమి ముత్యపుజల్లులా ఒక తలపు

మిట్టమధ్యాహ్నపు గ్రీష్మామారుణ  మంకెనపూల్లా
ఎర్రెర్రని అక్షరాలు ఎందుకో గాని సుతరామూ నచ్చవు
సుకుమారపు వసంతగాలిలా ఓసారి వీచి పోయే
క్షణికపు జీవితాన అక్షయ తూణీరాల్లా
ఎదురుదెబ్బలై రక్తం చిందించే పరిచయాలు

అయితేనేం
చెరుకు నాటిన చోట తీపి రసమే కాని
వేప చేదుకు తావెక్కడ?
పచ్చదనమే కదా పదిమందికి అన్నం పెట్టేది
వెచ్చని రక్తం చిమ్మే కత్తుల పదును కాదు.
గోడలు

ఖాళీ గోడలనే అంటారు అందరూ
కాని
రోజంతా వాటి ఎదురుగా ఉంటానా
క్షణానికో దృశ్యం – ఒకదాని వెనక ఒకటి
ఎక్కడ మొదలై ఎక్కడ ముగుస్తాయో తెలియదు.
నిమిషానికో కిటికీ తెరుచుకున్నట్టే అనిపిస్తుంది.

పచ్చపూల తీగ ఒకటి కిటికీ పక్కనే కదులుతూ
ఆకుపచ్చని అరచేతుల మధ్య
బంగారు పూపాపలను ముద్దు చేస్తున్నట్టే ఉంటుంది.
చేసొచ్చిన ప్రయాణాలూ చూసొచ్చిన స్వప్నాలూ కలబోసినట్టు
తైలవర్ణ చిత్రం ఒకటి ఉదయపు గోడపై వేళ్ళాడుతుంది.

మిట్టమధ్యాహ్నపు వేడి ముసురు మధ్య
గాలి కూడా ఊపిరి బిగబట్టి
కొమ్మల మధ్య విలాసంగా వెనక్కు వాలి
కళ్ళు తెరుస్తూ మూస్తూ కథలు కథలుగా
కావ్యాలు పలవరిస్తున్న రెక్కల కువకువలను వింటూ
చెట్టు మొదట్లో తొక్కుడుబిళ్ళాడుకున్న పరవశం
అలలు అలలుగా మతి పోగొడుతుంది
మగత నిద్ర మధ్య.

వెలుగంతా ముడుచుకు నల్లదుప్పటి బిగించి
కళ్ళు మూసుకున్నాక
మిణుకు మిణుకుమంటూ సోయగాల



నది మధ్యన తారట్లాడే తారకలు
ఈదుకుంటూ వచ్చి
ఎన్ని విన్యాసాలు ప్రదర్శిస్తాయో
చీకటి గదిలో సినిమా ప్రదర్శనలా.

ఖాళీ కోసం వెదుక్కోడం మానుకున్నాక
ఖాళీ లేని సమయమంతా
దేనికోసమో వెదుక్కుంటూనే ఉంది.
దారి కడ్డంగా నిలుచుని
కాస్సేపు ఆగమని సైగ చేస్తూనే ఉంది.
కాళ్ళావేళ్ళా పడి
గోడలనిండా కలలు అలుముతూనే ఉంది.





# ప్రేమ

ప్రేమ ప్రేమంటారు, పెదవి విరుస్తారు
ఆ ఏముంది ప్రేమ కవిత్వమే కదా అని
ఒక ఆత్మను అమ్మ గర్భంలోకి ప్రేమగానే కదా
ఆ అంతర్యామి ప్రవేశపెట్టినది
ఆకలి కేకలతోనో ఆర్తనాదాలతోనో
అస్తిత్వపు నిరసనలతోనో కాదు గదా
పుట్టుకకే ఒక చిరునామా అయిన
ప్రేమ నాకు ప్రపంచం ఆ ప్రేమే నాకు ప్రేరణా, ఉనికీ
ఆ ప్రేమే నాకు అమృతపానం.

రంగూ రూపూ రుచీ లేవంటారు
కనిపించనంత మాత్రాన రూపాలు ఎందుకుండవు
కనిపించిన రంగులన్నీ అలదుకున్నందుకే గదా
అలా వెల్ల వేసిన తెల్లని తెలుపైనది
ఒక్కసారి ఆస్వాదిస్తే కదా అమృతం రుచి తెలిసేది

అమ్మ పెదవులపై లాలిపాట
హత్తుకున్న చేతుల మధ్య మమేకత
ఎంత దాచుకున్నా పొంగిపొర్లే సముద్రం కదా
ప్రేమ కోసమే కదా విధ్వంసాలూ, విలయాలూ
ప్రేమకోసమే కదా మౌనాలూ ముసి ముసి గుసగుసలూ
ప్రేమైక ద్వీపాలే కదా కావ్యాలూ కథలూ
భాషలూ భావాలూ
అందుకే ప్రేమ నాకు ఊపిరి
ప్రేమ ఒక ప్రత్యక్ష దైవం




# తెలీదు కదా,
# ఎవరికి మాత్రం ఏం తెలుసు?

1.
ఉదయాలూ సాయంత్రాలూ
సునాయాసంగా నలిగిన దారి వెంట
ఊసులాడుతూ,
రేపటి రూపాలను తైలవర్ణ చిత్రాలుగా
నీరెండల కాన్వాస్‌ల మీద
నిరంతరం ప్రదర్శిస్తూ...
దిగుళ్ళూ బెంగలూ కాలం తెరవెనుక
దాచేసుకుని కాలక్షేపం చేసేప్పుడు
ఎవరికి మాత్రం తెలుసు?

2.
ఒకే కప్పు కింద
ఎవరికి వారు ఏకాంత ద్వీపాల్లో
కంప్యూటర్ విండోల నుండి ఆధునికతను వీక్షిస్తూ
సెల్‌ఫోన్ తరంగాలతో మాటలు పెంచుకుంటూ
పంచుకుంటూ
ఉమ్మడి ఒంటరితనాలలో
తలమునగా మునిగి తేలే వేళ
ఎవరికి మాత్రం తెలుసు?

3.
చల్లగా ముసురూ లేదు
భీకరంగా ఒక్క ఉరుమూ, జిగేల్మనే మెరుపూ
ఏవీ లేవు.
చేతులు కలిపినంత సస్నేహంగా
ఎదకు హత్తుకున్నంత ప్రేమలా
ఏ కారణమూ లేకుండా
పండుగ చేసుకునే సంబరంతో
ఇలా నిశ్శబ్దపు పిడుగై వస్తుందని
ఎవరికి తెలుసు?

4.
ఒంటరిగా వచ్చి రెండై నాలుగై
లక్షలుగా మారి
ఇంత వేగం ఇంత మెరుపూ
దోమ వాలి ఎగిరిపోయేంత సమయంలో
రెండు చేతులూ చాచి చుట్టేసిన వలయం
ఎప్పటికప్పుడు విశాలమవుతూ
విశ్వమంతా విస్తరించి
ఒక సుడిగుండమైపోతుందని ఎవరికి తెలుసు?

5.
ఖాళీ చేతులు చాచి
అందిన ఆయుధాన్నల్లా అందుకున్నా
వేడీ వెలుగూ చలి అన్నింటికీ



కవచాలున్న శత్రువును
ఎలా జయించాలని సమతమయ్యే మేధస్సులు
ఖాళీగా వీగిపోతున్న కలలు
ఎవరికి తెలుసు ఇలా
చేతులు ఎత్తెయ్యాలని?

6.
కొత్త జీవితాన్ని నిర్వచించే సాంకేతికత
శక్తి చాలదు
పాత బంగారపు బలాబలాలు
ఇక్కడ తేలవు
నిరంతర గుంజాటనల మధ్య
అనుక్షణమూ ఒక యుద్ధమే.
గుప్పిట మూస్తే రహస్యం విప్పితే చాలు
అదే తొలి ఆలోచన

నువ్వు జీవించు
నలుగురిని బ్రతికించు!



# అన్ని సమయాలూ...

అన్ని సమయాలూ ఒకటే కావు.
అన్ని... అన్ని క్షణాలూ  కాంతి కెరటాలే కావు.

ఒక్కోసారి ఉత్సాహమంతా ఉతికి ఆరేసి
మడతలు పెట్టి నిర్లిప్తత షెల్ఫ్‌లో దాచినట్టు
నీలికాంతి నైట్ బల్బ్ వెలిగించుకు
పక్కమీద ఒత్తిగిలినట్టు
తచ్చాడి తచ్చాడి ఏమీ తెలియనితనంలో
ఏకాంతం ముడుచుకు కూచున్నట్టూ
కదల్లేక, పడి ఉండలేక, కుదురు లేక
సతమతమయ్యే సమయాలు.

పొద్దుపొద్దున్నే తూర్పుగాలి
చల్లదనంతోపాటు యోగనిద్రలో సుఖశాంతులనూ
రెండు చేతులా మోసుకు వచ్చినప్పుడు
చప్పట్లు చరిచే వేపకొమ్మల సంతోషం
నరనరానా డ్రిప్ ఎక్కించినట్టై
ఇంటి ముందు ప్లాస్టిక్ తొట్టెలో
నిండుగా వికసించిన కమలాలవుతాయి
పూలు విరిసే సమయాలు.

సాయంత్రాలు – ఒకప్పటి సాన్నిహిత్యాలు
కలబోసుకుంటూ



ఎప్పటి సుగంధాలో చుట్టూ చల్లుకుంటూ
ఇంకా మొగ్గ తొడగని మొక్కల చివుళ్ళు సవరిస్తూ
లేతాకుపచ్చ చివురాకుపై
నీటిబొట్టు అద్దంలో
ఎప్పటి నన్నో వెతికి తెచ్చుకున్నట్టు
సరిహద్దులేవీ లేని సమయాలు.

ఇప్పటి సమయాలు మాత్రం
ఎవరిని వారు భూగృహాల్లో నిర్బంధించుకు
ఎవరి చుట్టు వారో కనిపించని ప్రహారీ నిర్మించుకు
అహం బ్రహ్మాస్మి అనుకునే
దుర్భర సమయాలు.
నిస్సహాయంగా చాచిన చేతులవంక
వంకర చూపులు విసిరే విషసమయాలు.
దుఃఖపడే పెదవులపై
చిన్న సంతోషాల చిరువానైనా కురిపించలేని
క్రూర సమయాలు
ఏడు కాలాల స్వప్నాలు ఇవ్వలేకున్నా
ఒక చిన్న అభయం
మేం ఉన్నామనే ఒక్క తొలకరి చినుకు
కావలసిన సమయం ఇది.



# నడక

ఏళ్ళకేళ్ళుగా అదే తోవ
అడుగులు కూడ దీసుకుని పడుతూ లేస్తూ
నడక నేర్చినది మొదలు
ఒకటే నడక, అదే దారి.
నడిచినంతసేపూ
అటూ ఇటూ చేతులు పట్టుకు ఊసులాడుకునే
ఆరు నిలువుల చెట్లు
గాలి అనుయాయులై
నేలకు బెత్తెడు పైన మోసుకుపోతున్న భావన.

సుడిగాలి స్వప్నాల మధ్య
సుళ్ళు తిరుగుతూ విస్తుపోయిన వాస్తవం
ఒక్క క్షణం కాళ్ళు నేల కానించాక
నెమ్మదించిన నడక
బాటంతా రాళ్ళు, ముళ్ళూ
ఎన్ని రక్తప్రవాహాలతోనో
ఈ తోవను అభిషేకించిన నడక.

పాలపుంత అనుకున్న బాట
గట్టి నేలై
పదును బారిన రాళ్ళ దారై
విచ్చుకత్తుల మొనలు నాటిన



వెచ్చటి నెత్తురు మడుగైనా
నడక ఆగదు.

మొదట్లో చూపులన్నీ పక్కవారిని సవరించేవి.
ముందూ వెనకా నడిచే నాలాటి వారిని అనుకరించేవి
వేగం నాదై విజయం నాదై ఎగిరిపోవాలనుకునే కలలను
వీపున మోసుకుంటూ చీమనడకలు నడిచిన రోజులూ ఉన్నాయి.

నడక మందగించి ఆగిపోయిన చోట లోలోపలి నడక ఆరంభమై
వేసిన తప్పటడుగులను తెరకెక్కించి చూపుతుంది.
ఈ నడక మెత్తగా శయనించిన నది మీద నడక.
నీకూ నాకూ తేడా లేదనిపించే నడక
ఇప్పుడు దారులూ నేలా అవసరమే లేదు.
అయినా నడక సాగుతూనే ఉంటుంది
మనసు నుండి మనసుకు.





# అనిపిస్తుంది

**అ**వును అనిపిస్తుంది.
ప్రతిధ్వనిస్తున్న గాలితరగల్లో
సుడి తిరుగుతున్న
రంగు రంగుల గాలిపటమై
పనికిరాని సొద నిరంతరం
మాట్లాడుతున్నట్టే అనిపిస్తుంది.

మాసిపోయిన ఆకాశాన్నీ
రంగు వెలిసిన హరితవనాలనూ
వాషింగ్ మెషీన్‌లో ఉతికి ఉతికి
మళ్ళీ ఒకసారి ఆరేసినట్టుగా ఉంది
జనం మరచిపోయిన నట్టడవిలో మరోసారి
వెదురు కుటీరం ముందు
వాలుకుర్చీలో వాలి సేదదీరుతున్నట్టుగా
అనిపిస్తుంది.

ఊహల ఊలు దారాలతో
అల్లుతున్న నిశ్శబ్దాన్ని గట్టిగా కేకేసి
గొంతు విప్పి పాడుతున్న
స్వేచ్ఛాగీతాన్నీ ఈ గుండెకు చెవినానించి
వినమని చెప్తున్నట్టుగా ఉంది.



రోజుకో కొత్తమొగ్గ తొడుగుతున్న
రాధామనోహరం తీగ గారాలు పోతూ
రాగాలు వినిపిస్తూ గునుస్తున్నట్టుగా అనిపిస్తోంది.
ఈ అనిపించడాల మధ్య
నెమ్మది నెమ్మదిగా దిగుతున్న నీడల వెనక
సడి లేని ఒక జత అడుగుల అలికిడి.

లీలగా అవలీలగా మంచుతెరలా
ఆవహిస్తున్న ఒక ప్రశాంతత
ఆశ్చర్యం!
నా ఎదురుగా నువ్వనుకున్నాను కాని నేనే
వింటున్నానో చెప్తున్నానో కాని
స్వరం మాత్రం నాదైన నీది.
మాట పెగలని పెదవులపైకి
దొర్లివస్తున్న నీ దరహాసపు వెలుగులు

బాగా మాగిన ద్రాక్షరసంలో మునిగి
నీకు దాసోహమంటూ
నా ఉనికి



# ఋణానుబంధ రూపేణా...

ఎప్పుడైనా చూశారా?
ఎక్కడినుండో పాకి వచ్చిన ఆత్మ ఒకటి
ఇక్కడ ఆగిపోయి
వటవృక్షమై పాతుకుపోడం గమనించారా?
మిట్టమధ్యాహ్నం, సాయంత్రపు మసక వెలుతురులా
ఉన్నట్టుండి దట్టంగా చుట్టూ అలుముకోడం
సుదీర్ఘమైన శ్వాస చివర
రెల్లుపూల కొమ్మై నర్తించే విభ్రమ ఒకటి ఎరుగుదురా?

మెలికలు మెలికలుగా సాగే కాలిబాట పయనంలో
ఏకాంత ఘడియల్లో పలవరించే పలకరింపుల్లో
రెండు ఆత్మల ఆత్మీయత నిమిషంలో అదృశ్యంగా
నింగిని తాకుతూ పోయే సూపర్ సానిక్ విహంగమవడం
చటుక్కున జారి జలకన్యలా ఈదడం
అంతలోనే పేనిన ప్రపంచం తాటి మీద
గారడి పిల్లై సుతారంగా అడుగులు కదపడం
పద్మవ్యూహం మధ్యన చిక్కి
బిక్కమొహం వెయ్యడం అనుభవమేనా?

ఇక్కడ ఆత్మలకు దేహాలు ఒట్టి అలంకారమే
దేహాలకు ఆత్మ సాన్నిహిత్యానికీ అస్సలు అనుబంధమే లేదు.
యుగయుగాలుగా ఎదురుచూసే ఆత్మలన్నీ
దారివెంట కలుస్తూనే ఉంటాయి
ఒక గంటో ఒక రోజో ఒక జీవన కాలమో
ఋణానుబంధ రూపేణా...



# ఉన్నట్టుండి...

మాట ఒకటి ఉన్నట్టుండి
మబ్బుల మధ్య మెరుపై
తళుక్కున మెరుస్తుంది.
వెంటనే వెయ్యి చేతులు మొలిచినట్టు
పట్టి నిలవరిస్తుంది
మౌనంగానే మౌక్తికాలను దొర్లిస్తూ
చిన్న పులకింతై వణికిస్తుంది.
ఊహ చివరన ఉనికి తొణికి
ఎటూ కదలనివ్వదు.

అప్పుడప్పుడు అంతే.
అయినా చెప్పడానికేమీ లేదు.
వెలుగూ వెన్నెలే కాదు
జిలుగు మెరుపుల తళుకులూ కాదు
ఎక్కడినుండో తొంగిచూస్తూ
నేలకు దిగిరాని జలపాతం ఒకటి
పర్యవేక్షిస్తూనే ఉంది.

మూతలు పడుతున్న
చీకటి కనురెప్పల మీద
అర్ధరాత్రి అప్పటికప్పుడు మొలిచిన
వటవృక్షం ఒకటి నిలువత్తు సాక్ష్యంలా
నిలుచునే ఉంది.

దాటివచ్చిన క్షణాలు వెనకాల మహాసముద్రమై
అలలు అలలుగా ముంచెత్తడానికి
పరుగులు తీస్తూనే ఉన్నాయి.

చెప్పాలన్న ఆదుర్దా ఆవగింజంత కూడా లేదు
మూటకట్టుకున్న మరకతాలను ఎవరికీ పంచాలనీ లేదు

ఊపిరితోపాటే ఊరేగే తలపు
ఉలిపిరి కాగితపు రెపరెప
మంచిగంధపు పరిమళమే.





# ఇక్కడ ఎవరైనా ఒకటే...

1.
నువ్వూ నేనూ అపరిచితులమేనా?
ఎప్పుడైనా ఒకరితో ఒకరం
ఏ చెట్టుకిందో కూచుని మాటలు కలబోసుకున్నామా?
ఊహ తెలియని రోజుల్లో ఉన్నవీ లేనివీ మాట్లాడుకున్నట్టు
గుండె బరువు దించుకోవాలని ఉన్నా
మాట వెలికి రానివ్వని భేషజాలు
పదిలంగా మూటకట్టి దాచుకున్న
తొణకని కన్నీళ్ళ నిండుమేఘాలు
ఎప్పుడైనా నువ్వు నేనై నేను నువ్వై పంచుకున్నామా?

2.
నువ్వో మూలనా నేనో మూలనా ఎగురుతూ
ఏ కొమ్మ చివరో వాలిపోయి ఆలోచించుకునే
సీతాకోకచిలుకలమే కావచ్చు.
గుండె గొంతు వరకూ పొంగుకొచ్చిన దుఃఖంలో
ఊపిరాడని విలవిల రూపమే కావచ్చు
పగలూ రాత్రీ తేడా గమనించని
యాంత్రిక మరబొమ్మలమే కావచ్చు
దిగులు ఆనవాళ్ళు తుడిచేసుకు
ముఖకవళికల మడిని దున్ని
గులాబీ అలరురు నవ్వులు అతికించుకున్న
మహానటులమూ కావచ్చు
అయినా మనం ఒకరి కొకరం సుపరిచితులమే.

3.

ఒక్క క్షణం ఆగి
లోలోపలి లోతులను కొలుచుకుంటే
నువ్వూ నేనూ ఒక్క చోటే ఆగిపోతాం
ఇద్దరినీ పలకరించే ఋతువులన్నీ అవే కదా.
ఇద్దరినీ ఉతికి ఆరేసే కల్లోలాలూ కరోనాలూ
కల్మషాలూ, కైపులూ అన్నీ ఒకటే కదా
అరచేతి రేఖల మీద ఆగిపోయిన సముద్రపు అంచులూ
ఒకటే కదా
వచ్చీ పోయే అతిథుల్లా అప్పుడో ఇప్పుడో
కాస్సేపు ఊరడించి ఏడిపించే అనుభూతులూ ఒకటే కదా.

మరింకెందుకు నువ్వూ నేనూ అనుకోడం
నువ్వేమిటో నాకూ తెలుసు
నేనేమిటో నీకూ తెలుసు
అయినా దూర దూరంగా
ఎందుకీ పులితోళ్ళ ముసుగులూ
వెన్నెల అలదుకున్న అమావాస్య జీవితాలూ

ఇక్కడ ఎవరైనా ఒకటే
ఒకరిలో ఒకరు కనిపించే అద్దాలే!





# అనుకున్నా...

ఎక్కడెక్కడో విహరిస్తున్నాననే అనుకుంటారు
అడవులూ, నదులూ, పూలూ, పళ్ళూ
భుజాన వేసుకు వీధి వీధినా
ఊహలు అమ్ముకుంటానని అనుకుంటారు
పరిమళ సురభిళ పూపొదరిళ్ళనుంచి రాలిన
మాటలు ఏరుకు వచ్చి మంత్రం వేసినట్టు
లోకాన్ని ప్రేమమైకంలో ముంచేస్తాననీ అనుకుంటారు.

తిరిగి వస్తున్న దారులన్నీ అందరూ తిరిగేవేనని
అందరికీ తెలుసు
పిల్ల పాపల కోసం కొమ్మ అంచుల్లో గూడుకట్టే
పిట్టతల్లి మనసులాగే
రెక్కలు వచ్చి ఏ మూలమూలలకో ఎగిరిపోయినా
దీపాల వేళకు గూటి అంచుకు చేరలేదని కలవరపడినట్టే
దారులన్నీ నెమరు వేసుకుంటూ ఉండిపోతుంది మనసు.
ఆకలితో అలమటిస్తున్న పల్చని పేగులకు
నాలుగు ముద్దల ప్రేమ ప్రాణం పోసే సంజీవనే కదా

ఎంత దూరాన ఉన్నా రాలిన పూల పుప్పొడి
చటుక్కున గుభాళిస్తుంది – లోలోపల
రోజూ ఒకసారి నడచి వచ్చిన దారి మననం చేసుకోడం
మరువపు మొక్కలను సవరించటమే కదా
దారిపొడుగునా పలకరించే

పన్నీటి చినుకులను పదిమందికీ పంచటం
పొంచి ఉండి గాయపరచే తుమ్మ ముళ్ళను
ఏరి పారేసుకుంటూ పోడం ఒక హెచ్చరికే కదా
కాస్సేపు ఓపిక పట్టి దృష్టి పెడితే
చలికి కొంకర్లు పోతున్న సమయంలో
కప్పుకునే వెచ్చని చుక్కలు పొదిగిన రజాయి కదా
గడచిపోయిన కాలం వెనక్కు చూడటం
ఎప్పటికప్పుడు నేలను తాకుతూనే
పరిమళమై ఎగసే తొలి చినుకు కదా అనుభవం
కలల తీగల మీద కదిలే రాగదీపం కదా జీవితం.





# ఏదైతేనేం?

సమయం భయం మంచులో సుప్తావస్థలో
తలదించుకు గడ్డకట్టిపోయింది
కాళ్ళూ చేతులూ ఆడని అపస్మారక దశలో
కనురెప్పలైనా వాల్చకుండా
తెలిసీ తెలియని అయోమయాన్ని
చూపులతో తాగి తాగి
తమస్సును రాత్రి గాలి చెరిగిపోస్తోంది.

యుగధర్మమో ఏమో కాని
కాలుష్యం కర్కశహస్తాల చెర వదిలిన
గాలి తలారా ఏకాంతంలో మునిగి పునీతమై,
కొత్త జీవం పోసుకు గుండెలనిండా పరుగులు
ఆధునికత అస్తిత్వపు ఆందోళనలో
దిమ్మతిరిగి సొమ్మసిల్లిన చెట్టు చేమా
స్వచ్ఛందంగా పూలమొగ్గలూ రెమ్మలూ తొడిగి
సీమంత చేమంతులుగా తలలూపి ఒక పరామర్శ.
చీకటి రాత్రి సుతారంగా గోరంత గిల్లి పారేసిన చంద్రవంక
ఆలస్యంగా అడుగులు తడబడుతూ వచ్చి
పలకరింపు ప్రహసనాలు లేక
పాలుమాలి మేఘాల చాటున ఒదిగినట్టు

ఇప్పుడిప్పుడే ఒక ఆశ రేఖ ఆకాశం ఎక్కాలని చూస్తోంది
ఉదయం ఉదయమే

నిశ్శబ్ద కెరటాలను కాస్త కదిలిస్తూ
కనిపించకుండా వినిపిస్తూ
ఎక్కడినుండో వస్తున్న ఆ పిట్ట పిలుపు
ఎన్నిసార్లు మోసం చేసిందో
తలుపు వెనకాల మెత్తని వేలికొసలు తగిలి
పలికిన కోయిల స్వరమో
పక్కనే పదిలంగా విశ్రమించిన దూర ధ్వనితరంగాల
మేలుకొలుపు గానో
కొమ్మ కొమ్మనా గూళ్ళల్లుకున్న పక్షుల నెత్తిన పిడుగుపాటు
మళ్ళీ మొదలు రణగొణధ్వనుల యుద్ధాలు
ఎప్పటికప్పుడు మొలిచే ఆధునికత క్రూరమృగాలు
ఏ రాయయితేనేం
అటు కొత్తరోగమో ఇటు కోరి తెచ్చుకునే
సుఖసోపానాల విషపానమో ఏదైతేనేం?





# శిశిరపు చార

వాన ధారలు కాస్త మొహం చాటేసేసరికి
చలిపులి పిల్ల ఒకటి టక్కుతూ తారుతూ
బాగా పొద్దుపోయాక మునివేళ్ళ మీద
వీధులన్నీ పరవశంగా విహరిస్తోంది.
కాళ్ళ దగ్గర అత్యవసరం కోసం పడి ఉన్న రజాయి
నిద్రలోనే ముణగదీసుకుని వణుకుతున్న
అస్థిత్వాన్ని మౌనంగానే పరామర్శ

ఆదరాబాదరా అయిదున్నరయీ కాకమునుపే
మసక వెలుగులను వేడితో సహా
మూటగట్టుకుని చంకన పెట్టుకు
ముసిరిన పొగమంచు వెనకాల రాత్రి గుహలోకి
పరుగు పరుగున నిష్క్రమిస్తుంటే
పచ్చని పైరు పక్క మీద ఒత్తిగిలిన
ఆఖరి వెలుగు కిరణం అరమూసిన కనురెప్పల మధ్య
అస్పష్టంగా ఒక స్వప్నం
రుతువులను పెనం మీద వేసి తిరగా మరగా
కాల్చి కాల్చి అలసిపోయిన ఆకాశం
వేళ్ళాడబడిపోతూ
చుట్టూ గోడలను వెతుక్కునే వేళ

నాలుగు గోడల్లా చుట్టూ నిలుచున్న ఊహలు
నిలువెల్లా వెచ్చని నెగళ్ళుగా మారి

వెలుగుతూ ఆరుతూ
శిశిరపు సంగీతం వినిపిస్తాయి
చలిపులి అడుగుజాడల వెంట వేటాడే జ్ఞాపకం
గాలి తడబాటును పక్కకు తొలగిస్తూ
పాదాలు సవరదీసుకుంటుంది
వెనక్కు తిరిగి వెలుగుల్లోకి పయనిస్తూ





# అక్షరాన్ని కదా...

ఎగిరినంతసేపూ
నింగికీ నేలకూ మధ్య చేతులు చాచి నిల్చున్న
సీతాకోకచిలుకలానే అనిపిస్తుంది.
ఏ మూలనా హద్దులూ, సరిహద్దులూ గుర్తుకు రావు.
ఎగరలేనప్పుడు కదా
అదృశ్యంగా అదుపు చేస్తున్న
బంధాలూ అనుబంధాలూ స్ఫురించేది
దేహాన్ని ఎక్కడో నిద్రపుచ్చి
అనంత విశ్వసౌందర్యంలో విలీనమయే
తృష్ణకు హద్దూ అదుపూ సాధ్యమేనా!

నీళ్ళింకిపోయిన గాజుతొట్టెలో
శుష్కించిపోతున్న దేహం ఏమైతేనేం
నీలిసముద్రం దోసిట పట్టిన మనసుకు
ప్రతి నీటిచుక్కా నీ ఉనికే కదా.
ఎక్కడ దాచుదామన్నా గుప్పున వెదజల్లే
మొగలిపూల పరిమళమై ఊహ
అక్షరం అక్షరాన అత్తరు సీసాలు ఒంపిన వైనం

నాలుగు గోడల మధ్యనో
నాలుగు భువనాలకావలో
ఎక్కడ ఉంటేనేం?

అడుగడునా పరవశించే ధూళి కణాలు ఏరుకుంటూ
రవ్వలు పొదిగిన చిత్రపటాలను అణువణువునా
అలంకరించుకుంటాను.

తొలకరి ఉదయాన రాలిన రెల్లుపూల మధ్య
క్షణం ఆదమరచిన పలవరింతలను
పదిలంగా పోగేసుకు తులసికోటలో నాటుకుంటాను
గతానికి జారిపోయిన జీవితాన్ని తవ్వి తెచ్చి
అగరు పొగల మధ్య అలవోకగా కదిపే గాలి ఊయల నవుతాను.

నింగీ నేలల మధ్య నిలువెత్తు
సాక్షాత్కారానికి
దోసిలి ఒగ్గిన అక్షరాన్ని కదా!





# అప్పుడే కదా మొదలు

**బా**గానే ఉంటుంది
బాజాలు భజంత్రీలు
అటూ ఇటూ సందు చూసుకు వడ్డింపులూ
జాతరలో పేర్చిన సరంజామాలా నగలూ నట్రా
పట్టుచీరల విసవిసలూ
పరదాల వెనక ముసిముసి మురిపాలూ
బాగానే ఉంటుంది
అప్పనంగా అప్పగింతలవరకూ
అప్పుసొప్పుల మధ్య ఇరుక్కుపోయినా
అమ్మాయి వారింటి అతిథి మర్యాదలు

అసలు కథ అక్కడే కదా మొదలు
భార్యకూ అమ్మకూ మధ్య టగ్ ఆఫ్ వార్
అత్తకూ కోడలికీ మధ్య మాటల జోరు
మాటకూ మనసుకూ మధ్య భూకంపం
కోసిన బీట తాలూకూ నెరియ
అహానికీ మోహానికీ మధ్య తొలగని అడ్డుతెర

అప్పుడే కదా మొదలు
ఒక రాజీకీ ఒక అస్థిత్వానికీ పోరు
అస్థిత్వానికీ అమ్మతనానికీ పోటీ తీరు!



# కొంచం మారి...

లోలోపలి ఒక సాదృశ ఉనికిని అదృశ్యంగా
అలల కదలికలు నిద్రపోతున్న సరోవరంలా
ఒక జీవితకాలాన్ని ప్రశాంత సముద్రతీర విహారంలా
చిత్తడి గాలి తుంపరలు పూల ఊయలలై ఓలలాడించాలని ఉందా
నేను నేనంటూ పరుగెత్తుకు వస్తున్న విషాదాలను
నడిసముద్రపు సుడిలో ముంచి
పాదాల చుట్టూ పట్టీలై గిలిగింతలు పెట్టే
నురగ మునివేళ్ళ సౌకుమార్యంలా సాగిపోవాలని ఉందా?

వెలుగు కిరణాల ఆకురాయిపై పదును పెట్టుకుంటూ
కత్తెరలా ముక్కలు ముక్కలు చేసే
కసాయితనం పుట్టు కవచాన్ని కాస్సేపు పక్కనపెట్టి
మబ్బు కొసలు పట్టుకు అడుగులు వెయ్యడం నేర్చుకోండి
నీరెండ వెలుగుల్లో చుట్టలు చుట్టలుగా దొర్లుతున్న
రవ్వంత అభిమానపు రవ్వల వెలుగులను ముక్కుపుడకలుగా చేసుకు
కాస్సేపు అద్దం ముందు ఆగి చూడండి

నిండా కప్పుకున్న నీలి సముద్రాన్ని కాస్త పక్కకు జరిపి
మమకారపు పాలపుంత పరిమళాలు ఆస్వాదించండి.
విరిగి ముక్కలైన వేలాది మనసులకు సాంత్వనగా మారి
అనునయం ఆలాపన ఒకటి మధురంగా వినిపించండి
ఎప్పటికప్పుడు నేననే తీరానికి విసిరేస్తున్న కలతల
చితి పేర్చి తిలోదకాలు వదిలి చూడండి

గుండెలనిండా ఆవరించిన మంచితనం సుగంధాన్ని
రాత్రంతా స్వప్నిస్తూ ఉదయాలను ఆహ్వానించండి.




# మాట పదిలం

బియ్యంలో రాళ్ళు గాలించినట్టు
మాటలు గాలించటం తెలుసా?
రాళ్ళలా బరువైన మాటలు అడుగున చేరిపోతాయి
పూరేకులైన మెత్తని తలపులు అలలై తేలి తేలి ఆ వైపున చేరతాయి
ఊకదంపుడు వ్యాపకాలు చేటలకెత్తి చెరిగినప్పుడు
గాలివాటుకు దూరమయ్యే మనసులు ఊకగానే ఎగురుతాయి
ఊహకందని దూరతీరాలకు ఉమ్మడిగానే
నిశ్శబ్దం సాగుచేస్తున్న ఆకుపచ్చని పంటపొలాల్లో
అక్షరాలు ఇపుడిపుడే పాలు నింపుకుంటున్నాయి.

వెదురుమొక్కలా పెరిగే వెటకారపు ముంపు కింద
తప్పించుకోలేని మునకలో
అంతరాత్మ తలక్రిందులుగా తపస్సు
ఎప్పటికప్పుడు మూసలో కరిగించి
మలినాలు వదిలించుకుంటే గాని
మాటలు పరిశుభ్రమై మెరుగుపడవు
పరిమళపు పన్నీట అభిషిక్తమయితే కాని
పదం పదం స్వాతిముత్యపు చినుకులవవు

మాట మనిషికి గతచరిత్ర
మాట మనిషికి వికసిస్తున్న వర్తమానం
మాటే రేపు మనిషికి మిగిలే మనుగడ
మనిషి ఉనికిలాగే మాట పదిలం!



# రేపటి కల

ఎన్నాళ్ళైంది చెట్టూ చేమాతో కబుర్లాడి
నీడలూ జాడలూ చెట్టాపట్టాలేసుకు
శబ్దించకుండా రహస్యాలు మాట్లాడుకుంటూ
మైళ్ళకు మైళ్ళూ రాత్రీ పగలూ కలసి నడిచి.
కొమ్మకొమ్మనా కొట్టుకుంటూ తిట్టుకుంటూ
అంతలోనే ప్రేమాతిశయంతో ఒకదాన్నొకటి హత్తుకుంటూ
చిన్న చిగురాకు మొదలు పలకబారిన పండుటాకుల వరకూ
ఉమ్మడి సంసారపు సరిగమలను వినిపించడం ఏనాటి కథ!

మల్లెపందిరి కింద మధురోహలను కలబోసుకుంటూ
మంచెపైన వెన్నెల ప్రవాహాలను పరచుకుంటూ
కొత్త కాపురాలకు పునాదులు వేసుకోడం గతం అయిపోయింది కదా!
వెబ్‌సైట్లలో చర్చలూ సమావేశాలూ
తీగలు లేని పలుకుల మీద కాస్తున్న పందెపు జీవితాలు
ప్లాస్టిక్ పూల మధ్య కాపలాగా నియాన్ లైట్ల మెరుపుల్లో
దట్టంగా పులుముకున్న మేకప్ ముఖాలతో రేపటి ప్లాన్‌లు.

మావి చివుళ్ళు తిని కొమ్మకొమ్మనా గూళ్ళల్లుకున్న
పిట్టలు వాలే చెట్లు ఎందుకలా చడీచప్పుడు లేని చెక్కముక్కల్లా
ఏ మాంత్రికుడో చిత్రించిన శిలువ వేసిన కొయ్యలయినాయి
కలతపడిన తలపు కునికిపాట్ల మధ్య రెప్పపాటుకాలంలో ఒక కల
ఎక్కడినుండో ఎగురుతూ వచ్చిన హరితవనాల్లో



గుండెకు చెవులు మొలిచేలా
సీతాకోకచిలుకల రెపరెపలు
దిగులు బీడును తవ్వి సారవంతం చేస్తూ
మెట్లు దిగి జారుతున్న కొండాకోనా
కొత్త ప్రపంచానికి తొలి పునాదిరాయిలా
వెతుకుతున్న తీగ నిలువెల్లా అల్లుకున్న
వెచ్చని ఊహ!





# ఆగి ఎదురుచూడండి

**మ**న దారి మనకు ఎప్పుడూ
రెండువైపులా అల్లుకున్న రాధామనోహరాల
పుప్పొడి రాలిన పూలవనంలానే ఉంటుంది
ఉదయం తొలికిరణాలను పరామర్శిస్తూ
ఆస్వాదించే ఫిల్టర్ కాఫీ రుచిలానే అనిపిస్తుంది.
చుట్టూ పాతుకున్న ఏకాంతం కంచెలా
ఇష్టం ఎక్కడికక్కడ నిర్దిష్టమైపోతుంది
రెక్కలు రాని పిట్టకూనలను గుండెల మీద ఉంచుకున్నట్టు
రాత్రీ పగలూ కంటిరెప్పల కింద కాపలా కాస్తూ పెంచుకున్న మాటలు
ప్రాణం పంచి పదిలంగా దాచుకున్న నిధులుగానే అనిపిస్తాయి

నిజమే కదా
ఎదురుగా ఏడంతస్తుల అద్దాల మేడలు
వెలుగు చొరబాటుకు దారివ్వని ఆక్రమణలు
గాలి మాట దేవుడెరుగు
ఊపిరిని పంచుకు బ్రతుకుతున్న తరం కదా
లోనా బయటా హోరాహోరీలే
తలుపవతలే ఆగిపోయిన
మానవీయత ఉనికి తలవంచుకు కుదించుకు
ఈదురుగాలికి రెపరెపలవుతున్న సజీవత
పదిలంగా దాచుకున్న అక్షరనిధులు
విలయరూపమైన వరదపాలేగా



రెక్కలు పొదిగి చిలకల కొలుకులవుతాయనుకున్న
మాధుర్యాలు
నడి సముద్రపు నావలో దిక్కూ మొక్కూ లేని
అనాథలే కదా
కాస్సేపు ఆగండి
కొత్త లిపి పుట్టుకు వస్తుంది
అయితే సమాధులమీద శిలాశాసనంలా లేదూ
తలలు పైకెత్తి తన్మయత్వాన్ని పంచే తాళపత్రమో
ఆగి ఎదురుచూడండి!





# వాతావరణం

ఎక్కడైనా వాతావరణం ఆవరిస్తూనే ఉంటుంది
అలవోకగా అరనిమిషంలో రూపాలు మారుస్తూనే ఉంటుంది
నడివీధుల్లో నయగారా జలపాతాలు ఉరకలు వేస్తాయి
సందుసందునా నదీనదాలు వయ్యారాలు కురిపిస్తాయి
ఇళ్ళ ముంగిళ్ళలో కొలనులూ సరసులూ వెలుస్తాయి
అదీ క్షణికమే.
అయిదారు రోజుల్లోనే ఆబగా నీరంతా తాగేసే భూమీ
క్షణం తీరిక లేకుండా ఆవిరి చేసే దినకర కిరణాలూ
చూస్తూ చూస్తూ ఉండగానే పొడిబారే జాడలు
కాస్తకాస్తగా పాతుకుంటూన్న చలి కుదుళ్ళూ
పొగమంచు మేలిముసుగులో ముక్కెరల్లా
మసక వెలుతురు దాగుడుమూతలాడే చుక్కలూ
సాయంసంధ్య కాంతి వెలుగుల్లో తొంగిచూసే శీతలం
చూస్తూ చూస్తూనే చలి చిరుతై పరుగెత్తుకు వస్తోంది.

చలి పులికి పంజాలూ గోళ్ళూ లేవు మనసులకున్నట్టు
సమాధుల మీద పూలేరుకునే క్రౌర్యమూ లేదు
వాతావరణమే కాదు ఊసరవెల్లి రూపాలూ మామూలే
పెదవుల చివర సానుభూతి పలకరిస్తున్నా
నొసటన ఒక హేళన కొక్కిరాయిలా వెక్కిరిస్తూనే ఉంటుంది
సానుభూతి మాటలు కొమ్మ దులిపినట్టు రాలుస్తూ
చెట్టు కొట్టేసుకు కట్టెలేరుకునే తీరు
అణువణువునా కోరలే మనిషికి
అందుకే గదా వసుధ విషపూరితమైనది
పచ్చని పసిమి నీలిమకు తిరిగినది



# ఇక్కడే, ఈ మనుషుల మధ్యే...

మరో నులి వెచ్చని పలకరింపు
లోలోపలి ఆర్తిని మేల్కొలిపి
జలజలా రాలి మౌన విషాదంలో
విలవిలలాడుతూ విరిగిన ఎండపొడలా
హరితం హరించిపోయిన గడ్డిపరకై ఉనికి.

ఎంత చీకటి పొడిని హారతి కర్పూరంలో
మెదిపి మెదిపి
ఇష్టంగా కనురెప్పల చివర అలదుకున్నా
కొస అంటూ పొసగని అనంత జలరాశి చివర
ఇంతై అంతై సమస్త జీవరాశినీ పిడికిట బిగిస్తుంది.

సహజమే కదా
వెలుగును వెన్నంటి చీకటి పొరలూ
మసక మసక పొరలను విడదీస్తూ
వెలుగు కిరణాల వెల్లువలూ
ఒకదాని వెనక ఒకటి దొంగాట పరుగుల్లో
పొర్లుతూ దొర్లుతూ మామూలు విషయమే.

అప్పుడో ఇప్పుడో
జారుముడి వేసి వేళ్ళాడదీసిన
రంగుల సింగిణీ దరహాసం ఒకటి జారి
దారి పొడుగునా పూలమడులు అలంకరించినట్టు

ఉన్నట్టుండి కళ్ళు చెదిరే చుక్కలూ సూర్యులూ
నేలకు దిగివస్తాయి
అరచేతిలో పూబంతిలా పైనున్న జాబిలిని
అద్దంలో చూపుతాయి.

చుట్టూ చల్లిన ముచ్చుమాటల మత్తులో
సొమ్మసిల్లి సోయి మరచిన బాధా సర్పదష్టలూ
పీడన తాడనాల్లో క్షణం తీరిక దొరకని
అమాయకపు రెల్లుపూలూ
చెల్లా చెదరయేలోగా
కనికట్టు చేసిన మయసభ కరిగిపోతుంది.

దుఃఖమే దుఃఖానికి ఓదార్పు
లేమినుండే పొంగుకు వస్తుంది
ప్రేమాస్పద పాలసముద్రం
మునుగుతూ అందిస్తుంది అభయహస్తం!





# రెండు కాళ్ళు నేలను తాకగానే...

రెండు కాళ్ళూ నేలను తాకీ తాకగానే
వైరస్ ఒకటి చర్మాన్ని తొలుచుకుంటూ
రెప్పపాటులో
అణువణువూ వ్యాపిస్తుంది.
బిగిసిన పిడికిలి తెరుచుకోక మునుపే
నేననే అహం ఒకటి పిడికిలి బిగిస్తుంది.
అణువణువునా మొహరించిన సైన్యాలకు
కొండా కోనా చెరువులూ వాగులూ
దాసోహమో అదృశ్యమో
ఏదో ఒకటి తప్పదు.

జలగలుగా మారి పీల్చేసిన నీటి ఆనవాళ్ళలో
నీడలు తేలే అద్దాల మేడలు వెలుస్తాయి
నీరు నిండిన బెలూన్లే సజీవదేహాలైనా
నీరు వారికి ఆజన్మ శత్రువు
నీటి రక్తకన్నీరు సేవిస్తూ
రాక్షస రూపాలకు మేకప్ వేసుకునే
జీవిత విలాసాలు
నీటిసూత్రాలు ప్రవచిస్తాయి.

ఆవిరై ఆగ్రహించిన నీటి కన్నీరు
వరద విహ్వలతకు ఆధునిక రూపం అవుతుంది.

నేల తాకని కాళ్ళు నీటి వడిలో ఈతరాని చేపలవుతాయి
అమాయకత్వానికి చోటు లేని వసుధ
నీటితెర కింద సమాధి అవుతుంది.
కాళ్ళు నేలకానేసరికి
కళ్ళెదురుగా నిలుచున్న వైతరిణి కవ్విస్తుంది
సవాలు విసురుతూ
బలాబలాలు తేల్చుకుందాం
రారమ్మని.





# అదృశ్యంగా... (అర్ధరాత్రి)

1.
వెండి అంచులు సవరించిన
తెల్లని తేలిక మేఘంలానే అనిపిస్తానా
గాలి గిలిగింతల్లో వంకరలు తిరిగే
సుకుమారపు పూలతీగలా నర్తిస్తానా?
వాటి వెనకాల ఆవిర్లు నిండిన ఆర్తీ
పూలరేకుల్లా రాలలేని బెంగా
నిలువెత్తున అదృశ్యంగానే ఉన్నాయి కదా!

2.
ఏ అర్ధరాత్రో అదాటున దూసుకువచ్చిన
వెన్నెల చరణాలకూ చలి అరణాలకూ
ఎన్నిసార్లు సెలవిచ్చానో
నా ఉపిరి శ్వాసలను మోసుకువచ్చి
నీ ముంగిట వాలిన గడసరి
గడ్డిపూలైనా కమ్మని.

3.
మాటలో చూపులో రాయబారపు హంగులేవీ వద్దు
ఇక్కడ పూసి రాలిన తలపుల పరిమళాలూ
రాలీ రాలకుండా చూరట్టుకు వేళ్ళాడుతున్న జ్ఞాపకాలూ
అనుక్షణమూ నీ చుట్టూ రెప్పవాల్చని రెక్కలు మొలవెని
సీతాకోకచిలకల రంగుల రెపరెపలేగా
అవి చాలు కదా!



4.

ఇక్కడ ఉదయమే రెప్పలు విప్పుతున్న గులాబీలూ
పందిరి ఎక్కుతూ పలకరిస్తున్న
లేతాకుపచ్చ తమాలపత్రాలూ
విసిరి తరుముతున్నా రొద చేస్తూ మూగే తుమ్మెద హోరూ
అచ్చం నీలాగే నవ్వే పల్చని ఉదయపుటెండా
నీ ప్రతినిధులేగా!

5.
ఎంత శూన్యం ఎదురుగా ఉన్నా
ఎక్కడినుండో కొట్టుకువస్తాయి
రవ్వలూ రతనాల్లా మేలిమి సొగసులతో
గడచిన మాధుర్యాలు
తాళం పెట్టిన గది తలుపుల సందుల్లోంచి
అలవోకగా అగరు పొగలై పయనిస్తూ

ఉనికి ఎక్కడైతేనేం
ఊహ ఎక్కడుంటేనేం
అదెప్పుడూ ఒంటరి కాదు.





# చివరి అంచున...

పాదముద్రల చెమ్మ కాస్త కాస్త మరుగవుతున్నది
మరిగి మరిగి ఆవిరై పైకెగసిన మేఘపు ఛాయలో
దళసరి దుప్పటిలా కప్పేసిన పండుటాకుల నీడల కింద
ఒక తరానికి కమ్ముకున్నాయి చీకట్ల సెగలూ పొగలూ
క్షణికమైన రుతువుల మధ్య
కాస్సేపు నక్షత్ర మండలాల మధ్య విహరిస్తూ
స్వర్ణ జలతారు గూడొకటి అల్లుకుంటూనే ఉంటుంది
అనవరతం మెదడులోని పురుగొకటి
అడుగడుగునా ఏదో ఒక అశనిపాతం
ఎక్కడికక్కడ తుంచేసినా దాన్నే అల్లుకుని
అలసటెరుగక  పైకెగబాకుతూ అల్లుతూనే పోతుంది
పొగమంచు కమ్మేసిన చూపుల మధ్య
అలుక్కుపోయిన చిత్రాల్లో చూపు మందగించినా
ఒక స్వర్గసీమను వెతుకుతూనే ఉంటుంది.

స్వప్నించిన ఒక స్వర్గం నిన్నటి పూరేకై రాలిపోయినా
స్పందించి హృదయం మోకాళ్ళ మధ్య తలదాచుకు
చిగురాకు సందిట్లో మైమరచిపోయిన వేగుచుక్కలా ఒదిగిపోయినా
సమయం రూపాలు మార్చుకు సరిత్తులా ముంచేసినా
ఊహకందని ఊపిరి మాత్రం ఊరడిస్తూనే ఉంటుంది
అమాయకంగా ఎప్పటికప్పుడు రంగులద్దిన గాలిపటమై
ఆకాశపు చివరి కొమ్మకైనా అర్రులు చాస్తుంది.
కనిపించని దారి ఒకటి వేలట్టుకు నడిపిస్తూనే పోతుంది.



# సాయంసంధ్య

**కూ**చుని, పడుకుని,
చూస్తూ చూస్తూ నిద్రలోకి జారుకునీ
అలసిపోయిన క్షణాలు
ఏటవాలుగా నేలబారుకు దిగుతున్నప్పుడు
ఎక్కడినుండో పరుగు పరుగున వస్తాయి
మరుగున పడ్డ సజీవ ఘడియలు కొన్ని.
పచ్చపచ్చని పరిమళాలు చుట్టూ మూగి
ఉక్కిరి బిక్కిరి చేస్తూనే ఉంటాయి.

మసక వెలుతురులో
ఉండి ఉండీ ఎవరో కొమ్మలు ఊపినట్టు
జలజలమని రాలే పున్నాగల వాన
మెత్తమెత్తగా ఎర్రెర్రని పెదవులతో
పాదాలు ముద్దాడే పారిజాతాలు
ఎందుకు మళ్ళీ మరోసారి
కళ్ళముందు ఈ పచార్లు?
ఒక్కసారి కరచాలనం కోసం అన్నట్టు
నేలకు వాలుతున్న
తేలికపాటి మబ్బులు
పెరట్లో నాటుకున్న కలలు
ఎక్కడ భద్రంగా కాలాన్ని కప్పుకు దాక్కున్నాయో కాని
ఈదురు గాలి మధ్య రెపరెపలాడే శాలువా కొసల్లో
చిటికెన వేలట్టుకు ఊగే
అల్లరిపిల్లలవుతాయి.



పుల్లపుల్లగా రోజంతా చప్పరించే చిట్టి ఉసిరి
మరోసారి నాలుక కొసల్లో మెరుస్తుంది.
ఉదయాన్నే మేల్కొలుపుల తీయతేనియ
కోయిల కుహూకుహూలు
కోటి అనుభూతులు కుమ్మరిస్తాయి.
చల్లచల్లని కళ్ళాపి జల్లి ఇష్టం వచ్చిన ముగ్గులు
గీసుకున్న వీధి వాకిలి
అభిసారికలా చిక్కి శల్యమై
కారు చక్రాల కింద ఒదిగి ఉంటుంది.

ఇప్పుడు
గతమూ వర్తమానమూ కలిసి
నిమిషాల బండి లాగుతూ ఉంటాయి.
బ్రతుకు లోయ పొడుగునా పూసిన
రంగురంగుల గోరింట పూలు
నిమిషానికో ఛాయ కథలు  కథలుగా అల్లుతాయి.
సాయంత్రానికి సంసిద్ధమవుతూ
చంద్రకాంత పూలు
గుప్పిళ్ళ మధ్య ఎన్ని తరాలను దాచుకు వస్తాయో
బేరీజు వేసుకునే కలల మధ్య
ఎంత కమ్మని సాయంసంధ్య.



# మాటలు దొరకవు

అవును అన్నింటికీ మాటలు దొరకవు
పెదవులు తడబడతాయి.
ప్రేమలు మనసును మెలిపెడతాయి.
ఉన్నట్టుండి ఉనికి
ఆవిరై తెల్లని మేఘమై
ప్రవాహమై సాగిపోతుంది–
చిరునామా అంటూ లేని
బీటలు వారిన జీవితపు నెరదల్లోకి.

మూడో కంటికి తెలియని ఆవేశపు వరదలో
ఈదుతూ వాలున కాస్సేపు కొట్టుకుపోతూ
అందిన గడ్డిపోచ ఆత్మీయతలను అల్లుకుపోతూ
అంతలోనే
విదిలించిన వరద విసురుకు ఆధారం దొరక్క
విలవిల్లాడుతూ
సంభాషణలూ వాక్యాలూ దొరకని భాషలో
సతమతమవుతూ
నిరంతర తపనలో మాటలు దొరకవు.

ఒక నిరామయ స్థితిలో
ఏడు రంగులూ కలగలిసి పాలిపోయి
తెల్లమొహం వేసిన ఊహ



నీరవమై నవనాడుల మధ్య ఇంకిపోయే
కన్నీరై గడ్డకట్టిన వేళ
మాటలు దొరకవు.

గుండె పొలిమేరల్లో
చితి పేర్చుకున్న క్షణాలు
ఒక ఆలోచన భగ్గున బూడిదై
ఫీనిక్స్‌లా మళ్ళీ పుట్టినా
ఏదో తెలియని చిరునామాకే ఆరాటం
అయినా మాటలు దొరకవు
ఎవరితోనూ పంచుకుందుకు.





# చాలా రోజులు ఇలాగే ఉంటాయి

**చా**లా రోజులు
ఇలాగే ఉంటాయి
ముసురు పట్టిన ఆషాఢపు ఆకాశంలా
చేతులు ముడుచుకు ముణగదీసుకు కూచున్న
అలిగిన బుంగమూతి పాపాయిలా.
శీతాకాలం ఎగిరి గంతులు వేస్తూ
విజయోత్సాహంతో
చుట్టూ లోకానికి పొగమంచు రంగు వేస్తున్నట్టు
మధ్య మధ్యన ఆధునిక చిత్రంలా
తెల్లమేఘాల మంచుపూల మెరుపుతో.

కర్టెన్ పక్కకు లాగి
నీలాకాశం ఉల్లాసంగా నడచి వచ్చినట్టు
కొన్ని ఉదయాలు వెలుగురేఖల తాకిడికి
కళ్ళు విప్పే పొద్దుతిరుగుడు పూల మొగ్గల్లా
అప్పుడప్పుడు వచ్చి వాలే పాలపిట్టలై పలకరిస్తాయి.
వసంతానికి దూతలై మంచు ధూళి తివాసీ మీద
మునివేళ్ళపై అడుగులు వేస్తూ
మొగ్గ తొడిగిన పూలమడులు.

అక్కడక్కడ ముందే కూసిన అల్లరి కోయిల పిల్లల్లా
గాలి ఊయల్లో రంగులు బయటపెట్టి వెక్కిరిస్తున్న
కాశీరత్నాలూ నిలువెత్తు కాంచనపుష్పాల్లా



ఒకటో రెండో రోజులు
బీడు మైదానాల మీద
ఆకుపచ్చని రంగు ఒలకబోసినట్టు
హఠాత్తుగా మొలిచే అరాకొరా రోజులు
అయినా
దురాశ కాకపోతే
ఋతువులు మారడం సమధర్మమే కదా...
ఏ ఒక్క జీవితం ఆద్యంతం వసంతం కాదు
అలాగని శిశిరమూ కాదు గదా!





# ఇక్కడ కూడా ఒక సముద్రం పరచుకుని ఉంది

ఇక్కడ కూడా ఒక సముద్రం
పరచుకుని ఉంది.
బుడి బుడి నడకలప్పుడే
నేల చెరుగులు కలిపే సముద్రం
ఇక్కడే కనిపించింది.
ఆకుపచ్చ కొండల మధ్య
నీలి నీలి సరస్సులా
ఇక్కడ పైకి మాత్రం
ఒక గొప్ప పెయింటింగ్‌లా
కనువిందు చేస్తూనే ఉంటుంది.

సముద్రం చుట్టూ చంద్రవంకలై పరచుకున్న తీరాలై
విగ్రహాల్లా నిలిచిన మనిషి తోలు కప్పుకున్న
మృగాలు
అక్కడక్కడ రెల్లుపూల పడవలై
గాలివాటు తుప్పలు
అలలు గుప్పిళ్ళతో ఒడ్డుకు విసిరే
నత్తగుల్లలూ ఆలిచిప్పలూ
కొన్ని సజీవం మరిన్ని నిర్జీవంగా.

అప్పుడప్పుడు పడవలు పుట్టుకు వస్తాయి
పనిమాలా ఆహ్వానించిన తుఫానుల బీభత్సం
విలయతాండవానికి అబద్ధపు సానుభూతిగా



అర్ధరాత్రి
అచ్చరకన్నెలై నక్షత్రాలు దిగివచ్చి
సముద్రంలో జలకాలాడినట్టు
ఈ మధ్యన పెరిగిన ఆధునికత.
కొమ్మ కొమ్మా గుసగుస
ఇదేమి పోయేకాలమో అంటూ
నడిరేయి విందులూ వినోదాల్లో
సముద్రమే నగ్నంగా ఉరకలెత్తుతుంది.
మసక వెన్నెలే సాక్ష్యం
అన్ని నిధినిక్షేపాలతో
ఇక్కడ కూడా ఒక సముద్రం పరచుకుని ఉంది.





# పయనం

ఉన్నట్టుండి నాలుగు మాటలు
చదువుకోమని బలవంతపెడతాయి.
గాలిలో దొర్లి దొర్లి దుమ్మూధూళీ అంటుకున్నా
మట్టి కాళ్ళతో పరుగెత్తుకు వస్తాయి.
నిశ్శబ్దపు రాగాల మధ్య గమకాలు ఆస్వాదిస్తూ
నన్ను నేను వడబోసుకుంటున్న వేళ
నాలుగు మాటలు చేతులు పట్టుకు లాగి
వాటితో లాక్కువెళ్తాయి.
కాసిని మాటలు అంతే మరి!

కనిపిస్తున్నాయని, కళ్ళు తెరిచే ఉన్నా
కనిపించేవన్నీ కనిపిస్తున్నవే కాదు.
ఆ చుట్టూ ఇంకా ఎన్నో పరిభ్రమిస్తూనే ఉన్నాయి
రక్తమాంసాలూ ఊపిరే కాకుండా మరేదో ఉన్నట్టు.
మెళకువకూ సుషుప్తికీ మధ్య
స్వప్నపు లోకాల మధ్య విహారంలా
మరేదో ఉంది.

వెలుగురేఖల్లో అగుపించని వెయ్యిన్నొక్క భావాలు
అడుగు ముందుకు పడుతూనే అదృశ్యమయే బాట
రాలిపోయిన పూలు మళ్ళీ మొక్కకు అతుక్కోలేని
ఒక రహస్యంలాటి జీవం ఏదో ఉంది.
అది తెలుసుకోవాలన్న తపనే కదా
ఈ పయనం... సుదీర్ఘ పయనం!





# కిటికీ పక్కన...

కిటికీ పక్కనే రెండు ప్రపంచాలు
లోలోపలి కనిపించని రహస్య భూగోళం ఒకటి
తెరిచిన కిటికీ గుండా పయనించే బాహ్యప్రపంచం ఒకటి
వెన్నెల మడుగైనా చీకటి నలుపైనా
వాడిన పూల మధ్య రాలిన ఆకుల మధ్య
నిరంతరం సాగే జాతర అది.
కాలానికీ నెమరువేతకూ లంకె కుదరదు
అస్తవ్యస్తంగా వదిలేసిన గదిలా
ఓ పక్కన కుప్పలు కుప్పలుగా
ఉతికేసిన గతపు వస్త్రాలు
మరోవైపు ఇష్టంగా జీవితం పుటల మధ్య
దాచుకున్న సంపెంగలు.
కలగాపులగంగా అటూ ఇటూ తిరిగే
జనసందోహాల కలగూరగంపలు
అంతా అయోమయమే.

కిటికీ ఊచల మధ్య కొలతలో
జాగ్రత్తగా కోరి అడుగుపెట్టే ఎండపొడ
కోరకుండానే దాని వెన్నంటే
దృశ్యాదృశ్యాల రాగవల్లరి.
తొంగితొంగి చూస్తున్న
తొలకరి మేఘాలూ
ఒంగి ఒకసారి పలకరించి రివ్వున పారిపోయే

పిట్టపాపలు
గోడలు తగిలించిన ఫ్రేమ్ కట్టిన ఫొటోల్లా
ఆగిపోయిన ఎడారులూ
బీడుభూములూ
నాలుగు కన్నీటి చుక్కలు రాలినా చాలు
నవనవోన్మేషంతో తలలు పైకెత్తే
హరిత పవనాలు.
మూగసాక్ష్యాలుగా మిగిలిన మావికొమ్మల మధ్య
పిందెలుగానే రాలిపోయిన కలలు

కిటికీ పక్కన మిగిలిపోయిన క్షణాలు
భవిష్యత్తుకు దర్పణాలు కాదు గదా...





# పునరుజ్జీవన

పెద్ద తేడా ఏం లేదు
తలుపులూ కిటికీలూ మూసినా తెరిచినా
కాస్త నిస్తేజంగా పలకరించే గాలీ వెలుతురూ
వద్దన్నా పలకరింపుకు తరలివచ్చే
దొరల్లాటి దోమలూ, చుట్టూ చుట్టూ రొదపెట్టే
తుమ్మెద బారులూ...
పెద్ద తేడా ఏం లేదు
లోపల ఉన్నా తలుపుకు ఏ వైపున ఉన్నా.

ఒకప్పుడు ఉదయాలు గులాబీ తోటల మధ్య
పూలసజ్జలయేవి
కాలవలు తీసిన మొక్కల మధ్య
ప్రవహించే నీరయేవి.
ప్రతి మొగ్గా సిగ్గుపొత్తిళ్ళలో తొంగితొంగి చూసే
నవయవ్వనమయేది.
పగళ్ళు కాళ్ళరిగేలా తిరిగే యంత్రాలయేవి
సాయంత్రాలు అప్పుడప్పుడే విచ్చుకుంటున్న
సన్నజాజి తీగల పరిమళాలయేవి.
అప్పుడప్పుడే దాగుడుమూతలాడే వెలుగు చీకట్లయేవి.

ఇప్పుడు మాత్రం
తెర ఎదురుగా పాతేసిన మూగరాటలైపోయాయి.
బుల్లి తెరో చిన్న తెరో

ఏదో ఒక తెర
భయంగా ఉంది
కాళ్ళు అవశేషకాలు అవుతాయేమో
కలలలోనూ అంతే
విమానాలూ, జెట్ వేగపు కార్లే తప్ప
నడకలు కనపడవు.

భయం ఒకటి నరనరాన సరసరా పాకి
కాళ్ళు లేని జనం కళ్ళముందు పేజీలై
తిరిగాక
చటుక్కున తోట ఒకటి ఇంటి ముందుకో
బాల్కనీలోకో తేవాలని
ఇగిరిపోతున్న సజీవత మళ్ళీ
అణువణువునా నింపుకోవాలన్న ఆశ.
పసిబిడ్డలను దత్తత తీసుకున్నట్టే
ఇప్పుడూ ప్రతి మొక్కా
ఉదయమే
చేతులు చాచి బోసినవ్వులతో పిలుస్తుంది.





# మనకూ మనకూ మధ్యన...

మనకూ మనకూ మధ్యన
అపారమై విస్తరించిన అహం సముద్రం
అడ్డుగోడలు కడుతూ
నిలువెత్తి ఎగసి కుప్పకూలి
నిరంతరం వృధా ప్రయాసలో...
వెలుగు చీకట్లవుతూ
నాదనే భ్రమ విభ్రమలు.
ఒకరినొకరు ఆక్రమించాలన్న
సుదీర్ఘ తపనలో
కారాలూ మిరియాలూ నూరుతూ
సూర్యచంద్రులు
కళ్ళప్పగించి చూస్తూ అవని.

ఎన్ని కాంతి సంవత్సరాల దూరం ఉంటేనేం
అహానికి చేతులు పొడుగు కదా
ఎంత సుదూరం అయితేనేం
నీటిబొట్లు చిలకరించి
పొడిబారిన మట్టిని పలకరించి
మరకతాల నాట్లు వేసేందుకు
మనకూ మనకూ మధ్యన
రెండు కన్నీటిబొట్లు కరువయాక
లోలోపలి మాగాణులు తడిసేదెలాగ

బీడు వారిన మనం
ఎప్పటికి పంటపొలాలవాలి?

నువ్వూ నేనూ ఒకలానే
ఈ నేలపైన ఊడిపడ్డాం
ఎల్లలు లేని గాలి పీయూషాలు సేవిస్తూ
ఎదగాలని చూస్తున్నాం
ఇక్కడే పాతుకుపోవాలని శతవిధాల పోరాడతాం

ఎన్ని చేస్తేనేం నేల చెరుగులను
మూటకట్టుకోలేం కదా
నీకూ నాకూ మధ్య దూరాలు కుదించుకు
సువిశాలమైతేనే కదా
మనకూ మనకూ మధ్య మాటలు పొసిగేది
మనకూ మనకూ మధ్యన
నవతరం నిలిచేది.





# కలగంటి...

ఉన్నట్టుండి పరదా లాగేసినట్టు
వెలుగు మూసుకుపోతుంది
మసక చీకట్లు కమ్ముకు వస్తాయి.
గట్టిగా పట్టి బంధించి
ఏ తీహార్ జైల్‌లోనో
ఎవ్వరికీ తెలియని చోట బంధించినట్టు
ఉన్నట్టుండి సూరీడు మాయమవుతాడు.
మసక చీకట్ల మధ్య పొడలు పొడలుగా
చర్మవ్యాధి ప్రబలినట్టు
పాలిపోయిన వెలుగు పరచుకుంటుంది
అక్కడక్కడా...
ఇదంతా ఋతువులు ఆడే నాటకమే.
కుంభవృష్టి ఉన్నట్టుండి
నడినెత్తిన పిడుగై పడే వరకూ
ఈ తెరచాటు వ్యవహారం అంతేగా!

అదేం పెద్ద డ్రామా అనీ
నాలుగ్గోడల మధ్య కుంచించుకుపోయి
క్షణ క్షణానికీ రాలిపడుతున్న
భయాలు ఏరుకుంటూ
హృదయం ఉందో లేదోనని బెంబేలు పడుతూ
మాటిమాటికీ ఒళ్ళు వేడెక్కిందేమోనని కలవరపడుతూ
ముక్కూ నోరూ గొంతే జీవితమై
మిగతా సమస్తాన్నీ విస్మృతిలో పారేసి

రేపటి కోసం దిగులు రంపంతో తంటాలు పడుతూ
ఇది కదా నిరంతరం సాగుతున్న నాటకం.

ఒక్కోసారి పిల్లల ఆటలో ఎవరో కొంటెగా
ప్రపంచానికి ఫ్రీజ్ చెప్పినట్టు
ఎక్కడికక్కడ ఒక్కసారిగా స్తంభించి
నిశ్చలంగా నిలిచిపోయినట్టు
కనురెప్పైనా కదలని దశలో యావత్ జనసమూహం
పాదాలకు పరిచితమైన నగరపు వీధులు
ఎంతగా బెంగ పడుతున్నాయో
ఏ సాయంత్రమో నీలాకాశంలోకి ఎగరేసే
తూనీగ రెక్కల గాలిపటాలు ఎంత బెంగటిల్లాయో
అక్షరాలు అక్షరాలుగా సాగే రాగాల తీగల కొసలు
ఎంత మూగవోయాయో!

ఆగలేక తూలిన కునుకు పట్టిన అరనిముషంలో ఒక కల
పచ్చిపాలలో పసుపు కలిపినట్టు
పగలూ ఎండా రాత్రి వెన్నెలా
ఎప్పటిలానే.
కొమ్మల చంకలనెక్కిన హరితపత్రాల మధ్య
అమ్మ కొంగు చాటునుండి తొంగిచూసే పసిపాపల్లా
ఒద్దికగా ఒదిగిన చిరుమొగ్గలు

వీధిమలుపులో
సుతారంగ నడిచి వస్తూ
కొత్తశకం పొరల మధ్య దాచుకున్న
నెమలీక అప్సరస.




# ఒక రోజున..

మనం పూలమొక్కలు నాటుతాం
మన మనసులూ విశాలమే
మన దేశమూ సువిశాలమే.
ఊరంతా, దేశమంతా, దేహమంతా
పరిమళాలు ప్రవహింపజేయాలని తహతహ.
అడుగడుగునా రంగు రంగుల హేల
నర్తించాలన్న కోరిక.
దారి పొడుగునా రసభరిత కావ్యమై
రాగఝురులు కలకూజితాలై సాగాలన్న ఆశంస.
పిడికిట ప్రేమ సౌరభాల పూరెక్కలు
నలుగురికీ పంచే సౌభాగ్యం మనది.

అదేం దౌర్భాగ్యమో
ఎక్కడ చూసినా జనప్రవాహం ఆవిరై
ఎడారులైన నగరపు వీధులు
రాత్రీ పగలూ మరచి
నిర్విరామంగా ఆగి ఆగి
కూస్తున్న అంబులెన్స్ సైరన్‌లు.
జీవన్మరణాల మధ్య వారధి కడుతూ
వ్యాపారదీక్షలో క్షణం తీరిక లేని ఆసుపత్రులు.
ఆవగింజలను భూతద్దాల్లో చూపి
భయం రాక్షసులను ఆవాహన చేస్తున్న
తెరపైని తోలుబొమ్మలు.

ఎడతెగని యుద్ధం
విశ్వమంతా యుద్ధభూమే.
ఓడిపోయి పండిపోయి రాలిపోయిన పండుటాకులు
పరుగుపందెంలో తలపడుతూ
పడుతూ లేస్తున్న యువతరం
ఎక్కడ చూసినా భయ బీభత్సం

కనురెప్పపాటు
అంతే
బీడైన ప్రపంచాన్ని దున్ని
సస్నేహపు విత్తనాలు నాటేందుకు
తిరిగి ఎప్పటిలా
పూలవనాలు పెంచి పోషించేందుకు
ఏదో ఒక పొగమంచు ఉదయాన
ఎప్పటిలా ఒక నీడ గొడుగై నిలుస్తుంది.





# ఇచ్చి పుచ్చుకోవాలి

ఇచ్చిపుచ్చుకోడం మన ఆనవాయితీ
ఎన్నేళ్ళుగానో ఇస్తూనే ఉన్నారు
ఇష్టంగానో అయిష్టంగానో స్వీకరిస్తూనే వచ్చాను
తీసుకోడం తప్ప తిరిగి మీకేం ఇచ్చాను?

ఏకాంతంగా ఎక్కడికక్కడ కునుకు తీస్తున్న
చెరువులకు సెలవిచ్చి ఎరువు రెక్కలనిచ్చి
ఎగిరిపోయిన చోట
పాలరాతి భవవాలూ భువనాలూ ఇస్తే
వద్దని అనలేదుగా!

పచ్చపచ్చగా ఊసులాడుకునే
వనాలను కొల్లగొట్టి రాతివనాలుగా
దారిపొడుగునా నీడలైన
నిలువెత్తు చేయూతలైన చెట్లను
చెక్కముక్కల కళాఖండాలుగా
బహూకరిస్తే కాదనలేదుగా!

ఎనాళ్ళు ఇలా చేతులు చాచి
రుణపడి ఉండటం
చూపుల మధ్యనుండీ
వేళ్ళ సందులనుండీ
జారిపోయిన సజీవతను చూస్తూ

ఆలోచనల అల్లకల్లోలాలనించి
సునామీలు పుట్టుకు వచ్చాయి
ఆధునికత కరచాలనాల మధ్య
నివురుగప్పిన ద్వేషాలు తన్నుకు చస్తున్నాయి
తేనెలొలికే చూపుల్లో రగులుతున్న
అసూయ జ్వరాలు.

నాకిచ్చే కానుకలకు బదులివ్వాలనేగా
చూపులతోనే అల్లుకుపోయే ప్రేమ
స్పర్శతోనే చటుక్కున వలవేసి లాగేసే ఆకర్షణ
కులాలూ మతాల ప్రసక్తి లేదు
ఖండాల అంతరం అస్సలు లేదు
బీదాబిక్కీ తేడాలు లేవు
చిన్నా పెద్ద లెక్కేలేదు
కరచాలనం చేస్తూ
అందరినీ అలరించే బహుమానం
ఇచ్చిపుచ్చుకోవాలి కదా మరి!





# చాలా రోజుల నుండీ...

చాలా రోజులనుండీ చెప్పాలనే ఉంది,
రాత్రీ పగలూ నా చుట్టూ చేరి
బీడు పొలాలై
మౌనంగా రోదిస్తున్న మబ్బు తునకలూ
ఎగురుతూ ఎగురుతూ
రెక్కలు విరిగి కుప్పకూలిన గాలి వేదనలూ
నిటారుగా నిలబడిన నిలువెత్తు చెట్లు
చీకటి మసిని పులుముకు
పల్చని వెన్నెల మేలిముసుగు వెనకాల
శబ్దం వినిపించకుండా ఎక్కిళ్ళు పెడుతున్న
నది నీటిలోకి వంగి కలబోసుకుంటున్న కష్టసుఖాలూ
అన్నీ మీతో పంచుకోవాలని ఉంది.
నీలాకాశం నక్షత్రాల వెలుగులో దిగంతాలు దిగి
మట్టి సుగంధపు మడులలో తలపులనారబోసినట్టు
ఒడ్డున స్పృహతప్పి సాగిలపడిన ఇసుకతిన్నెల నభిషేకిస్తూ
అలలు అలలుగా సొద వినిపిస్తున్న ఆ సముద్రపు రొదలా
మీతో చెప్పాలనే వుంది.
ఇది కాదు మనం వెళ్ళాల్సిన దారి అని.

సర్వం తెలిసిన కాలజ్ఞానుల్లా ఓ వెర్రినవ్వు రువ్వి
బీసీ కాలపు బామ్మా
నీకేం తెలుసు?
దోచుకున్న వాడిదే రాజ్యం

రాళ్ళు పాతుకున్నవాడిదే నేలంటూ
సమాధులు తవ్వుకునే
గునపాలకూ పారలకూ ఏం చెప్పను?
చేసుకున్న వాడికి చేసుకున్నంత
ఇటైనా అటైనా
అని ఎలా చెప్పను?
అయినా చెప్పాలనే వుంది.





# తరతరాలుగా...

ఎప్పుడు ఈ జాతి ఎక్కడ ఎలా వెలుగు చూసిందో
ఎవరికి తెలుసు?
పాదముద్రలు చెరిగి నాగరికత దారి పరచుకున్నాక
ఈ దారి ఒదిగిన మట్టిముద్దకైనా తెలుసా?
వేల వేల తరతరాల చరిత్రకు అంకురార్పణ
అక్కడే మొదలైందని!

ఎక్కడో నీటి ధారలుగా పుట్టి
మరెక్కడో పారి పారి
ఇంకెక్కడో సువిశాలమై
సారవంతమైన మాగాణుల మడులు కట్టి
ఏ మూలనో అంతర్వేదిలా మారిపోయే నది చిరునామా
ఏదని చెబుతాం?

పెదవి విప్పి సాక్షం చెప్పేందుకు
భూస్థాపితమైన ఆనవాళ్ళకు నాలుకలు లేవు
నీదీ నాదంటూ వాదులాడుకునే అహంకారాలకు
తాతముత్తాతల జాడలే తెలియవు
నోరు లేక కళ్ళప్పగించి చూస్తున్న అంతర్యామికి
ఋజువులు చూపే సత్తా లేదు.

సరిహద్దులు లేని అడవులకు తెలియదు
దాని ఒడిలో తరాలు గడిపే మృగాలూ

రెక్కలు విప్పి విశ్వదర్శనం చేసి వచ్చే పక్షులూ
మనుషులైతే ఈసరికి
అణువణువునూ ఆక్రమించుకునేవారని
ఎక్కడికక్కడ గిరిగీసి విడదీసేవారని

అయినా ఎన్ని తరాల  తరువాతో
ఒక నిశ్శబ్దం నిర్వచిస్తుంది
గాలిపై లేఖలూ నీటిపై పాటలూ
కలల మధ్య క్రౌర్యాలూ
ఉక్కు స్వరమై శాసిస్తుంది.
ఋతువులు వస్తూ పోతూనే ఉంటాయి
హక్కులూ అధికారాల మాదిరేనని.





# ఇంకా సజీవంగానే వుంది

**(ప్రపంచ కవితా దినోత్సవం)**

ఇంకా సజీవంగానే వుంది.
ఎంత క్రూరంగా నినాదాలూ అరుపులూ
మెలితిప్పి పేనిన పదాలతో బిగించినా
ఇంకా సజీవంగానే వుంది.

నగరం నడిబొడ్డున అధికారికముద్రతో
క్లోన్ చేసిన మాయామర్మాల సాక్షిగా
వీధివీధినా ప్రతి సాయం సమయానా
కాలక్షేపాన్ని మేస్తున్న జనసమూహాల సాక్షిగా
ఇంకా సజీవంగానే వుంది.

అస్మదీయులూ తస్మదీయుల
అలంకార విభ్రమల్లో అణచివేసినా
ఓ పక్కన పెదవి విరుస్తూనే నొసటి ముడిలో
తళుక్కుమనే అసూయ మధ్య
ఇంకా సజీవంగానే వుంది.

పసిమనసుల ఊహాలోకపు
రెపరెపల మధ్య చిప్పిల్లే
బుడి బుడి పలుకుల్లో
అక్షరం చిందే అందమైన రూపమై
ఇంకా సజీవంగానే ఉంది.

అనాదినుండీ సతతహరితాలై నిలిచిన
చిగురుటాకుల మధ్య
ఊహకు ప్రతిరూపంగా
ఊసులు చెప్పే చీకటి వెలుగుల్లో
ఇంకా సజీవంగానే వుంది.

ఎక్కడెక్కడో సజీవంగా కనిపించే
ఆమె చిరునామా తెలుసా
స్పందించే మనసుల్లో అపురూపంగా అల్లుకునే
కవిత్వానికి చిరునామాలెందుకు?
ఎప్పుడు ఎక్కడా సజీవమే కదా!





# భాషే కావాలా?

ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు
ఉత్తి మాటలూ లేవు
రోజూ పడిగాపులు పడి
మిట్టమధ్యాహ్నపు పిలుపుకు
ద్వారబంధం పక్కన ఎదురుచూపులూ లేవు
రోజంతా తుంపరలు తుంపరలుగా
రాలుతున్న చినుకుల సందడి.

ఎక్కడో జలజలమంటూ రాలిన పిలుపు
ఇక్కడ నిశ్శబ్దపు పలుకురాయిలా నినదించే
రాయబారమే తప్ప
పెదవుల కదలికా లేదు
పదవుల హుంకారాలూ లేవు
ఉండిఉండీ రాలిపడుతున్న
చీకటి సరాగాలే తప్ప!

ఇచ్చిపుచ్చుకుందుకు భాషలే కావాలా?
ఏ భాషలో వెలుగూ చీకటీ సంభాషిస్తాయి
ఏ భాషలో వసంతమూ పరిమళాలూ
జంట స్వరాలై ప్రవహిస్తాయి
శ్రుతి కుదరాలే గాని
ఏ భాషలో మానవత్వం
మొలకలెత్తుతుంది

భాషే కావాలా?
విధ్వంసానికో
విలయతాండవానికో
భాషే కావాలా?
కొత్త నెత్తావుల లేత చిగుళ్ళకు
కోయిల స్వరాలకూ.





# యుద్ధం ఆరంభమైంది

యుద్ధం ఆరంభమైంది.
సిద్ధంగా ఉండండి.
ఆరంభం ఎప్పుడూ  అలవోకగానే కనిపిస్తుంది.
ఓసోస్ ఇంతే కదా అనిపిస్తుంది.
కాదు కాదంటూ సవాల్ విసురుతూ
కబళిస్తూ దూసుకువస్తున్న యుద్ధాన్ని ఎదుర్కోండి.
వెయ్యి హస్తాలు చాచి
కబడీ ఆడుతూ అందరినీ చుట్టపెడుతున్న ఆ శత్రువుకు
'నో ఎంట్రీ' అంటూ
తట్టిన తలుపుల పిలుపులకు నిశ్శబ్దపు జవాబులే ఇవ్వండి.

ఎక్కడ ఎలా పుడితేనేం ఒక విషక్రిమి
కరచాలనం చేస్తూ, కనురెప్పల విహాయసాలనెక్కి
తుంపరలు తుంపరలుగా విస్తరిస్తూనే ఉంది
వాయువేగం అందిపుచ్చుకు పరిఢవిల్లుతూనే ఉంది.
వాడలు దాటి, వీధులు దాటి నగరాలు దాటి
దేశాలు దాటి, ఖండాలనూ అతిక్రమించి
కనురెప్పపాటులో ఇంతై అంతై
అతిక్రమణ బాటలో పయనిస్తూనే ఉంది.

యుద్ధం ఆరంభమయింది
సిద్ధంగా ఉండండి.

బెంబేలెందుకు?
మశూచిని తరిమికొట్టాం
కలరాను పరుగులు పెట్టించాం
ప్లేగ్ చార్మినార్ గోడలకింద భూస్థాపితం చేసాం
ఇప్పుడిక ఇదెంత...!

అసుంటా అసుంటా అంటూ దూరంగా ఉండడం
తప్పేమీ కాదు
తప్పని సమయం ఒకటి చటుక్కున వచ్చినప్పుడు
తప్పదు మరి!
ఒక రక్షణ కవచం మన చుట్టూ మనం
కట్టుకునే పెట్టనిగోడ
అయిసొలేషన్.

గృహమే కదా స్వర్గసీమ
ఇల్లు మనది, అక్కడ ఉండేదీ మనమే.
మన ఇల్లే మనకిప్పుడు స్వర్గాదపి గరీయసీ
ఇప్పుడు చెప్పేవేవీ కొత్త కాదు
తరతరాలుగా మన వెనక వెన్ను కాచినవే.

ఇది వరకు యుద్ధం
చీకటి లోకాల మయం
కిరోసిన్ చిరుదీపం
చాలీచాలని తిండి



ఎన్ని యుద్ధాలు గెలిచాం.
ఇదో పెద్ద లెక్కా,
సమయం ఎక్కడా ఆగదు.

సర్దుకుపోదాం ఒక నెల
సద్వినియోగం చేసుకుంటూ
నువ్వూ నేనేనా ఎప్పుడూ
మనం అని అనుకుందాం ఇప్పుడు.





# వాళ్ళిద్దరూ...

ఎక్కడ చూసినా కనిపిస్తారు
ఈ వాళ్ళిద్దరూ
ఎవరికి ఎవరు ఏమీ కారు.
అయినా
క్షణాలూ నిమిషాలూ గంటలూ
మౌనం మధ్య మాటలు చాలని
మనసుల రాయబారాల మధ్య
అప్పుడో ఇప్పుడో
గాజుపలక మీద నెమలీక మునివేళ్ల మీద నడచినట్టు
మెత్తటి ఆరుద్ర పురుగులాటి మాట ఒకటి
ఆమె సింధూరపు పెదవుల చివర దొర్లుతుంది.
మనసు అరచేతులు పట్టి అతను పదిలంగా
భద్రపరచుకుంటాడు.

గలగలా గుడి గంటలా బడి గంటలా
సుళ్ళు తిరుగుతూ గాలిపొరలను
కదిలిస్తూ అదలిస్తూ
అతను ఏవేవో చెబుతూనే ఉంటాడు
చూపుల వెనక ఆగిపోయి
పెదవుల వెనక దాగిన మాట కోసం
యుగాలైనా ఎదురుచూస్తున్నట్టు
వింటూనే ఉంటుంది ఆమె.



ఏటి తరగల మీద రెల్లుపూల నావలా
కనీ కనిపించని చిన్న నవ్వు
కంటి కొసల్లో అంకురిస్తుంది
ఆబగా హరితవనాలను వెతుక్కుంటాయి
అతని ఉద్వ్యఘ్నాలు.

మాటలు నేర్చుకుంటున్న పసివాడిలా
తడబడుతూ చెబుతూనే ఉంటాడు
అమ్మతనం స్పర్శకు అద్ది
పరిమళిస్తుంది ఆమె.

అయితే నదికి ఆ ఒడ్డున ఒకరూ
ఈ ఒడ్డున ఒకరూ
అది అంతం లేని సాన్నిహిత్యం
ఎడబాటు లేని ఏకాత్మ సాంత్వనం





# గప్ చుప్!

ఎప్పుడు నింగీ నేలా
ముచ్చటించుకున్నాయో
పులకరించిన ఆకాశపు అలజడి
రాలిపడిన ఆకుల మధ్య సిగ్గిల్లిన భూమీ
ఏ రహస్యాలు పంచుకున్నాయో
వేనవేల ఛాయలు ఇద్దరి మధ్యా
అటూ ఇటూ పరుగులు పెడుతూ
ఎన్ని దాగుడుమూతలు ఎప్పుడు ఆడుకున్నాయో...!

రుతువులు ఏ ఎడారులకు ప్రవహించాయో మరి
బీడువారిన జనావాసాల మధ్య నిశ్శబ్ద సంభాషణల్లో
సమావేశమైన భయోత్సాహాలు
రెండై నాలుగై ఎనిమిదై పదహారై...
కన్నుమూసి తెరచేలోగా
అక్షయమవుతున్న పాదాలతో
నేల అణువణువునా పాదముద్రలతో నింపేస్తూ
ఒక మహమ్మారి
జడలు విరబోసుకుని వీధి వీధినా విహరిస్తూ
లక్ష్మణ గీతలు గీసుకున్న ఇళ్ళలోకి వెళ్ళలేక
కృంగి కృశిస్తూ...

ఒక కరస్పర్శ కోసం
ఒక చూపుల సమాగమం కోసం



ఒక దాహపు తృష్ణతో ఒక ఆకలి కేకతో
కనిపించని అతిథుల కోసం
ఆకుపచ్చని ఎదురుచూపులో
బకాసురిలా ఆవురావురుమంటున్న మహమ్మారికి
దూరం ఒక్కటే దారి
లంఖణం పరమౌషధం
ఆకలితో నకనకలాడి మాడి మసైపోయే వరకు
అంత పెద్ద పర్వతమూ చటుక్కున నేల కూలే వరకు
ఎక్కడి దొంగలు అక్కడే
ఏ మాత్రం దొరక్కండి
గప్ చుప్!





# తెలిసీ తెలియక...

నగరం వీధుల్లో నాలుగు మూలలా
భయం బితుకు బితుగ్గా ప్రవహిస్తోంది
గడ్డకట్టిన మౌనం మంచువానలో
గాలి కనురెప్ప వాలిన శబ్దం కూడా వినిపించేంత
నాజూకుగా భీతితెరపై పూరెక్క వాలిన అలలా
భయం సుతారపు కదలిక.

ఆకాశం నీలమో ఎరుపో తెలుపో
ఎవరికి తెలుసు?
ఎర్రెర్రని ఎండ దాచేసినది  పాలిపోయిన తెల్లమబ్బో
ఛాయ తగ్గిన నిండు మేఘమో ఎవరికి తెలుసు?
మూసిన తలుపుల వెనక
వెరపును పలవరిస్తున్న గుండె శబ్దాలకు
బయట పల్లవిస్తున్న వసంతం జాడలేం తెలుసు?

కొమ్మకొమ్మనా విరబూస్తున్న వసంతానికి తెలియదు
రేపటి జడుపేమిటో
ఎప్పటిలా వింజామర వీస్తున్న నిలువెత్తు
కొమ్మలకు తెలియదు
అడుగు అడుగునా పొటమరిస్తున్న
పరిమళ సుంగంధాలు
ఎప్పటిలా వనవిహారాలు చేస్తున్న



మృగసమూహాలకు తెలియదు
ప్రపంచం నడినెత్తిన రగులుతున్న
నిప్పుల కొలిమి ఏమిటో
తెలిస్తే అడుగు అడుగునా శ్మశాన వాటిక
తెలియనంత వరకూ పైరు పచ్చని వేదిక





# ఎందుకు ప్రతిదీ ఒక నటనే ఇక్కడ?

ఎందుకు ప్రతిదీ ఒక నటనే ఇక్కడ?
ప్రతి మాటనూ చిరునవ్వుల్లో ముంచి తీసి
పంచదార చిలకల్లా అలంకరించడం
బోన్సాయి మొక్కలకు పనసకాయలు కాసినట్టు
నేలకు జానెడు ఉనికిని భూతద్దంలో చూసుకుంటూ.

మనిషికీ మనిషికీ మధ్య దూరం మాత్రం
యోజనాల గణాంకాలకు సాగదీస్తూ
భుజం తట్టి చూపాల్సిన సానుభూతి
కుదించిన అక్షరాల్లో నలుగురిలో పంచుతూ
పిడికెడు మట్టిలో పెరగాల్సిన అనుబంధాలు
పాలరాతి గోడల మధ్య ప్రదర్శిస్తూ
ఎందుకు ప్రతిదీ ఒక నటనే ఇక్కడ ?

మాటిమాటికీ ఏదో ఒక సంక్షోభం ఇంటా బయటా
ఎవరి చుట్టూ వారు ప్లాస్టిక్ కవచాలు తగిలించుకు
ఎవరికి వారు అంటరాని వసంతాలై పోవడం
చుట్టూ కాలుష్యం నారు పోసి నీరు పోసి
గురివింద గింజల్లా కారణాలు వెతుక్కోడం.

అహాలు దెబ్బతిన్న సమయాన
అసలు రూపం వెలిగ్రక్కుతూ
అసహనాలకు వికారత నద్దుకోడం



చిన్నతనం గుర్తుకువస్తుంది
మొక్కల మధ్య మొక్కలా పెరిగి
చీడపట్టిన మాటలు తూర్పారా చెరగటం
ఉన్నదున్నట్టు కుండ బద్దలుకొట్టి వాదించటం
ఎవరి పనిలో వాళ్ళు తలమునకలై
క్షణం తీరిక లేకుండా బ్రతకడం
అప్పుడిలా చేతులు కలపటాలు లేవు
ఉన్నవీ లేనివీ వల్లెవేసుకోడాలూ లేవు
ఎవరి చుట్టూ వారే ప్రపంచమై పోవాలనే ఉక్రోషాలూ లేవు
చిన్నప్పటిలాగే పైనించి
నిర్విరామంగా గమనిస్తున్న చూపు ముందు
ఎంత నటిస్తేనేం ఎవరి లెక్కలు వారివైనా
మార్చడం ఎవరి తరం?





# నువ్వేమిటి?

ఇదేం మరీ పెద్ద విషయం కాదు
పుట్టిన కాస్సేపటికే మొదలు
అమ్మ గర్భంలాగా సౌకర్యంగా లేదనో
చలి ఎక్కువనో, వేడి మక్కువ కాదనో
ఎవరూ గమనించలేదనో, ముద్దాడలేదనో
కేరు కేరుమంటూ
అసహనం ప్రకటించడం.

ఇహ మొదలు
అంతం లేని అసహనాల పట్టికకు గంట గంటకూ
తోచినవన్నీ చేర్చుకుంటూ పోడం.
తడబడే అడుగులతోపాటు
కుంటిసాకులు నాలుగు పోగేసుకోడం.
మాట నెగ్గలేదన్న అహం అహరహం
నివురుకప్పని నిప్పు కణికలు
గుండెనిండా రగిలించుకోడం.

గడ్డకట్టిన సిమెంట్‌లా సాయంత్రాలూ
కరిగి నీరైన ధృవాల్లా రాత్రులూ
మౌన ఘడియల్లో దొర్లించుతూ
ఎత్తిచూపే వేలు బిగుసుకుపోయినట్టు
అనుక్షణం ఎవరికి గురిపెట్టాలా అని అన్వేషిస్తూ



విలువైన కాలాన్ని బురదగుంటలో తొక్కిపెట్టడం
ఉగ్గుపాలతో వచ్చిన దుష్టభావనే కదా!

ఎందుకు వచ్చామో ఎందుకు ఉన్నామో
అనేది ఎక్కడో దారి మధ్యలో పారేసుకు
వికసిత ఉదయాలకు దూరంగా
వాడిపోయిన భావాలకు వెన్నెల తాగిస్తూ
ఇలా సాగిపోడమేనా?

ఒక్కసారైనా
ఒక్కసారంటే ఒక్కసారైనా
పరకాయ ప్రవేశం తెలిస్తే కదా
ఒక్కసారైనా గుండె సముద్రం అయితే గదా
ఒక్కసారైనా పసికూన బోసినవ్వు
పడమటికి వాలిన జీవితం మొహంపై మెరిస్తే కదా
నువ్వు నువ్వయేది
నీరెండ మెరుపులో ఉనికి ఉలిపిరి కాగితమై
నువ్వెందుకో తెలిసివచ్చేది.



# ఎన్నిసార్లో...

ఇలా ఒంటరిగా గతం వీధుల్లో
నడుస్తూనే పోతాను.
ఎన్ని నగరాలను ఎన్ని వీధులను
ఎంతమంది జనసందోహాన్ని దాటుకుంటూ వెళతానో
ఎన్ని మాటలు ఎన్ని మధురోహలు
మళ్ళీ మళ్ళీ వింటూనే ఉంటాను.
కనురెప్పపాటులో కాలాన్ని వెనక్కు తిప్పి
మళ్ళీ ఒకసారి దాచుకున్న హరిత దినాలను
గుప్పిట బిగించి
వెనక్కు నడిచి వస్తాను.
నిద్రపోతున్న వీధులను నగరాలకు వదిలి
వీధి దీపాలను సాక్ష్యంగా పెట్టి
నా గూటికి నేను తిరిగి వస్తాను.

వాలిన రాత్రి కాటుక కళ్ళ కింద
పోగేసుకున్న నీరెండల సొబగులను
తనివితీరా ఆస్వాదిస్తూ
నడుస్తూనే పోతాను వెనక్కూ ముందుకూ
అలసిసొలసి అరక్షణం రెప్ప వాలుస్తానో లేదో
అదృశ్యమయిన కాలం తిరిగి రూపం దాలుస్తుంది.
రాలిన ఆకుల గలగల గాలి తరగల్లో ఎగురుతూనే పోతుంది.
ఆ వెనకే నడుస్తూనే ఉంటాను
నడిచినంత వరకూ.



# ఇల్లు నిశ్శబ్దంగానే ఉంది

ఇల్లు నిశ్శబ్దంగానే ఉంది.
మెరుగుపెట్టిన పాత కాలి పట్టీలా
తళతళా మెరుస్తూనే ఉంది.
అద్దాలు పెట్టుకు వెతికినా
ఏ కాస్త ధూళీ కనిపించదు.
గదులన్నీ ఖాళీగా అలంకరించిన షోకేస్ బొమ్మల్లా
ఎప్పటికీ నవ్వుతూనే ఉంటాయి.

లోపలికి ఒకసారి తొంగిచూడాలని
సాలీడు పిల్లలకూ
తోక తెగిన బల్లులకూ ఎంత కోరికగా ఉన్నా
ఎక్కడి కక్కడ పదిలంగా సీల్ చేసిన
వెంటిలేటర్, కిటికీల మెష్‌లూ ససేమిరా అనుమతించవు.
మెత్తని జీవితం మీద వెల్లకిలా వాలి చూస్తే
సీలింగ్ మీద చిత్రించుకున్న ఆకాశంలో
మెరిసే చుక్కలూ, నెలవంకలో
బోసినవ్వులూ చిన్నారి వదనాలూ కనిపిస్తాయి.

ఇల్లు నిశ్శబ్దంగానే ఉంది
అయితేనేం
ఉన్నట్టుండి భళ్ళున కిటికీ అద్దం పగిలిన శబ్దం
పెదవులపైకి ఒక మైమరపులా పాకి వస్తుంది.
అవును క్రికెట్ ఆడి ఆ రోజున

సుపుత్రుడు పగలగొట్టిన అద్దం ధ్వని అది.
ధడేల్న తలుపులు మూసుకున్న పిడుగుపాటుకు
గుండె గుబగుబలాడిన గుర్తులు
అవి కూతురి కోపానికి బండగుర్తులు.

ఉన్నట్టుండి అర్ధరాత్రి
ఏ ముఖేష్ పాటలో వినిపిస్తాయి
కరెంట్ పోతే చాలు డాబా మీద జరిగే
గానసభ అవశేషాలు కదా!
చుట్టూ నందనవనంలా నాటుకున్న
పూలకుండీల్లో నాటి ఇల్లు ఇంకా సజీవంగానే వుంది.
ఇల్లు నిశ్శబ్దంగానే ఉంది
అయితేనేం
తలపులన్నీ స్వరరాగ సుధలే!





# లోకం తీరు

**చె**ప్పడానికేముంది?
అలాగని చెప్పకపోడానికేముంది గనక?
అవుననో కాదనో కాదు, ఉందనో లేదనో కాదు
మాటలు పెరిగి పొదుగై తీగలల్లుకున్నాయనో
లేదూ విరిగి ముక్కలై నేలపాలయాయనో
అస్సలు అసలేమే లేదు.
ఒక్కోసారి అంతే!
దారినపోయే దౌర్భాగ్యాన్ని పిలిచి ఆదరిస్తాం
నా అంత వారు లేరంటూ నడినెత్తిన అలంకరించుకుంటాం
స్నేహం కనకపు సింహాసనం పైకి
ఏ ఎముక ముక్క దొరుకుతుందా అని ఎదురుచూసే
దారే పోయే వీధికుక్కలను ఆహ్వానిస్తాం.
చూరట్టుకు వేళ్ళాడే చుంచు మొహాలను
లోనికి పిలిచి పట్టువస్త్రాల అనురాగాలు
ఫలహారంగా పంచుతాం.

రెల్లుపూల వరదల్లో కొట్టుకుపోతున్న
నక్షత్రలోకాన్ని కొంగున కట్టుకు
దారీ తెన్నూ తెన్నూ లేని మార్గాన
వశీకరింపబడ్డట్టు పరుగులు పెడతాం
నీరెండల పరదాలు జారుతుండగానే
దారి వెతుక్కునే వలసపక్షులు
ఉన్నట్టుండీ పనికిరాని ఈకలు రెండు మొహాన రాల్చి
వీధి చివర కనుమరుగవుతాయి.

ఎదురుచూడని విస్ఫోటానికి
పదాలు కోల్పోయిన పెదవులు
పాలిపోయిన అనుబంధాలను
కళ్ళలో వేలాడదీసుకుని
మౌనంగానే పలకరిస్తాయి.
అకాల మేఘంలా వచ్చే అపరిచితులు
అకాల వర్షమై కురిసి ఆవిరై పోతారని తెలిసాక
స్వాతిశయం పెంచుకున్న అసహనమే కదా
ఏమీ లేనితనం, అన్నీ ఉన్న వనం.

ఎప్పుడూ అనుకోలేదు





# ఈ రాత్రి

అటు దొర్లి ఇటు దొర్లి
చిరాగ్గా ఆలోచనలను విప్పి ఆరవేస్తూ
అంతలోనే మడతలు పెట్టి
మస్తిష్కం కింద పెట్టుకుంటూ
అక్షరాలకూ వ్యక్తీకరణకూ మధ్య
కునికిపాట్లు పడుతూ
తెప్పరిల్లుతూ
మాటలతోనూ మౌనంతోనూ
మూరలు మూరలుగా రాత్రిని కొలుస్తూనే ఉంది.

కనురెప్పలకు చీకటి మస్కారా అద్దుకుని
అక్షరాల నిండా ఆరాలను నింపుకుంటూ
నిజాలు చిక్కులు చిక్కులుగా ముడివేస్తూ
ప్రశ్నిస్తున్న ముళ్ళకు చూపులు వేళ్ళాడదీసి
గాయపడిన గుండె నిమురుకుంటూ
జడలు విరబోసుకున్న రాత్రి
నగరాన్ని కప్పేస్తుంది.

తికమక పడుతున్న ఊహనొకదాన్ని
వాక్యంలో కుదించాలని
బరువైన పదాల మూటను భుజాన వేసుకు
ఒక్కొక్కటీ నెమరేసుకునేప్పుడు
అన్నింటిలోనూ అందరూ కనిపిస్తారు

వాక్యంలో ఇమడలేని వేదన
వేదన ఇముడ్చుకోలేని పదాలు
రెక్కలు విదిలించి ఫక్కున నవ్వి
ఏ దిగంతాలవైపో ఎగిరిపోతాయి.

కొత్తగా మొలకెత్తుతున్న
జీవనశైలి
ఒక్కొక్క పుటనూ దీర్ఘంగా చదువుతూ
అధ్యయనం చేస్తూ
రేపటికి ఒక ఓదార్పు పరచుకోవాలన్న తపన
రాత్రీ పగళ్ళ పగుళ్ళ మధ్య బీజాంకురమౌతుంది.
అయినా అయోమయం దాటిన అక్షరాలు
ఎందరికో చుక్కానులవుతాయి.





# ఈ వసంతం

ఎక్కడో దూరతీరాల నుండి కోయిల స్వరం ఒకటి
లీలగా విన్నట్టుంది.
ఎన్నేళ్ళ అనంతరం
నీలిమ పరచుకున్న నింగి కింద
ఖాళీ వీధుల్లో ప్రవహించి ప్రవహించి
గులకరాళ్ళ పులకింతల మధ్య నది చేసే సవ్వడిలా
కొండలూ కోనలూ హరితవనాలూ
నగరం నడిబొడ్డున వెలసినట్టు
శిశిరపు మాగాణీ మంచుకు వీడ్కోలు గీతంలా
కోయిల సుస్వరం నినదిస్తూ...

గడచిపోయిన కరువు కాటకాల విషాదం
గుండెలో మంటలా ఎగసిపడే పోరబాట్లూ ఓటములూ
మాడి మసై విడిపోయిన అనుబంధాలూ
విరిగి ముక్కలైన స్వప్న సాఫల్యాలు
వేదన వికసించే విషాదాలూ కాలం తెరల వెనక్కు నెట్టేస్తూ
నినదిస్తున్న కోయిల రాగం.

అవును కోయిల స్వరం విప్పగానే
వసంతం పురి విప్పిన నెమలిగా మారి
అరవిరిసే మంచితనం మధ్య గుప్పున అల్లుకునే మట్టి వాసనల
రేపటి కలల మధ్య ఆనంద రుతువును ఆహ్వానిస్తూ
గుప్పెడు ఆశ వసంతంలా వెదజల్లుతుంది,
బీడువారిన ఆకాశం చివర హరివిల్లునొకటి చిత్రిస్తుంది.



# మాటలు

తియ్యని కవిత్వం రాయాలన్న యావతో
రాత్రంతా తేనెపట్టు పట్టాలన్న తపన.
కాని ఉదయానికి మిగిలేది మాత్రం
తుట్టె కదిలి కుట్టి కుట్టి తెగబలిసిన తేనెటీగలు.
ఉదయం అయ్యీ అవక ముందే
కళ్ళలోకి నాటుకుంటూ వెలుగురేఖలు
నాలుక చివర రెండు చవులూరే మాటలు.

అందంగా కిటికీ పక్కన ఒదిగి ఒదిగి
కునుకు తీస్తూ గునుస్తూ తెల్లపావురం ఒకటి
అర్ధరాత్రి విరిసిన తెల్లకలువలా ఊరిస్తుంది.
ఉదయం తలుపు ఓరవాకిలిగానైనా తెరవకముందే
ముక్కున కరచుకు వచ్చిన పురుగులు
ఒళ్ళంతా పాకినట్టు కంపరం మొలిచి
నాలుగు చేదు తలపులు తీగలై పాకుతాయి.

అనుభూతి భుజాలపై నెక్కించుకొని పసిపాపలా మోస్తూ
జీవితం నింపాదిగా జాగ్రత్తగా నడుస్తుందా
ఎక్కడినుండో దూసుకు వచ్చిన ఉండేలు దెబ్బ
ఎదురు దెబ్బై మనసును బద్దలు చేస్తుంది.
విలవిలలాడుతూ గుప్పెడు పదాలు బొటబొటా రక్తం స్రవిస్తాయి.
మాటిమాటికీ పునరావృత్తమయే గాయాలు రేగి
మాటలు స్రవిస్తూనే ఉంటాయి అయితే రక్తాశ్రువులుగా
లేదూ అమృతధారలుగా...



# నా దేశం

ఆర్నెల్లు దాటిపోయింది.
అవును, ఆర్నెల్లు...
గంటలూ రోజులూ గడిచి నెలలు నెలలుగా కదిలి...
నీరెండల చీలికల మధ్య మసక చీకట్లనూ వెలుగు జిలుగులనూ
అలదుకుంటూ ఓపిక ఉన్నంతసేపూ నడిచి నడిచి,
తీరిగ్గా ఇల్లు చేరిన సాయంకాలాలు...
అవి నిన్నటి కలలేనా?
ఏమో అంతా ఒక విభ్రాంతిలా ఉంది.
మనసుకు భయం అలవాటు పడ్డాక,
ఈ తుమ్మితే ఊడే ముక్కుకు
ఇంత వగపేమిటనే తెగింపుతో
జనం ఇప్పుడిప్పుడే నడకలు నేర్చుకుంటున్నారు.
సాయంత్రం చల్లబడ్డాక బయలుదేరబోతుంటే
రానే వచ్చింది ప్రశ్న.
“ఎక్కడికి?”
“అబ్బ, అడిగావూ, నడక మరచిపోయి కాళ్ళు వశం తప్పేలా ఉన్నాయి,
ఎవరింటికీ వెళ్ళనులే, అలా ఒక్కడినే కాస్సేపు తిరిగి..”
చిరాగ్గా జవాబు పూర్తి చెయ్యకుండానే వీధిలోకి నడిచాను.
అసలే నగరం పొలిమేరల్లో కాలనీ మాది.
కొంచం ముందుకు వెళ్తే ఎకరం ఎకరం స్థలాల్లో కట్టిన విల్లాలు.
తీరిగ్గా ఆ దారిలోనే నడక అలవాటు.
అదిగో ఆ చిట్టచివరి విల్లా నాకు మరీ ఇష్టం.
అన్నింటికీ దూరంగా విసిరేసినట్టు ఉన్నా,

ఇంటి ముందు వసంతం విడిది చేసినట్టు,
ఎన్ని రకాల పూలమొక్కలు.
ఫెన్సింగ్‌లా పెంచిన చెట్లు...
కళకళలాడుతూ కనిపించే ఆ ఇల్లు
సందడి చేసే ఉగాదిలా ఉండేది ఎప్పుడూ...
అయ్యో! అదేమిటలా బీడు పడిన భూమిలా
వెలవెలబోతూ ఉందిప్పుడు.
గేటు సగం తెరిచి వదిలేసినట్టూ...
అప్రయత్నంగానే ఆ వైపు నడిచాను.
మొక్కలన్నీ ఎండి చెట్లన్నీ పుల్లలుగా మారి
వాడిపోయిన శిశిరం రూపంలా ఉందిప్పుడు.
ధైర్యం చేసి పరామర్శిద్దామనిపించి ఆ వైపు కదిలాను.
కిర్రుమన్న గేట్ కదలనని మొరాయించింది.
ఆర్నెల్లుగా అలా సగం తెరిచే ఉంది కామోసు.
వానకు తుప్పుపట్టి బిగుసుకుపోయింది.
కష్టపడి సగం తెరిచిన గేట్ నుండే దూరాను.
ఇంటి వరకూ అందంగా పేర్చిన హృదయపు ఆకారపు
పాలరాతి పలకలు మురికిపట్టి
నాచు పేరుకుని ఎండి నానా వికృతంగానూ ఉన్నాయి.
అంటే ఆర్నెల్లుగా ఎవరూ వాటి మీద అడుగైనా వెయ్యలేదు.
ఓ పక్కన గార్డెన్ టీపాయ్ మీద కాఫీ కప్పులు కెటిల్,
ట్రే పడి ఉన్నాయి.
ఇంటి ముందు పిల్లలు నడిపే ఆటోమాటిక్ కార్...
అంటే అక్కడ అయిదారేళ్ళ పిల్లవాడు ఉండి ఉండాలి.
దుమ్ము కొట్టుకుపోయిన మెట్లెక్కి ధైర్యం చేసి తలుపు తట్టాను.



తెరుచుకుంది.
ఎదురుగా విశాలమైన హాల్లో ముందు కనిపించినది ఉయ్యాల
గాలికి ఖాళీగా ఊగుతూ...
అంటే చిన్నారి పాపాయి ఉండేది కామోసు.
ఇల్లంతా ఖాళీ అని నిశ్శబ్దం చెప్తూనే ఉంది.
పక్క గదిలోకి తొంగిచూశా...
టేబుల్ మీద మడిచిన పుస్తకం, కుర్చీకి తగిలించిన చేతికర్ర...
మనసు చివుక్కుమంది...
ఇహ ఉండలేక బయటకు నడిచా...
ఏమై ఉంటుంది?
ఇంట్లో అందరూ ఉన్నఫళంగా ఇల్లు వదిలేసి
ఎక్కడికి వెళ్ళి ఉంటారు?
ఎందుకో ఒక కీడు ఆలోచన తొంగిచూసింది.
అందరినీ ఉన్నవాళ్ళను ఉన్నట్టుగా క్వారంటైన్‌కు తరలించారా?
ఆర్నెల్లుగా రాలేదంటే...
ఆ వదిలేసిన ఇల్లు నా దేశంలానే అనిపించింది.



# ప్రశ్నార్థకం

ఏం మత్తులో మునిగి ఉన్నామో కాని
వర్తమానం ఎప్పుడూ ఒక ప్రశ్నార్థకమే.
కాస్సేపు ఆకాశాన్ని వేలం వేద్దామనీ
మరికాస్సేపు హరితవనాలను అమ్ముకుందామనీ
అంతలోనే ప్రపంచాన్ని పిడికిట బిగించి
అరికాలి కింద అవని అణచి పెడదామనీ
పెడత్రోవలు పట్టే అతి తెలివి ఊసరవెల్లి ఊహ.

సువిశాలపు నింగీ నేలా
చేతులు చాచి గుండెలు నింపిన ఊపిరి
స్వేచ్ఛాగీతాలు ఆలపించిన క్షణాలు
ఎలా తారుమారైనాయి?
ఇరుకిరుకు సిమెంట్ హర్మ్యాల మధ్య
కాలు కదిపే సావధానం లేని
హడావిడి పనికిమాలినతనం మధ్య
అమ్ముకున్నది ఎవరిని వారే కదా!

చిరిగిపోయిన భవిష్యత్తు పీలికలను ముడి వేసుకుంటూ
కరిగి నీరై ప్రవహించిన కాలుష్యాన్ని చుట్టూ
పన్నీటి సువాసనలా చల్లుకుంటూ
రేపటి విలవిలల మధ్య
భయం దుర్భిణి గుండా ఎన్ని యుగాలు ఇలా?



ఎవరికి వారు సుప్తావస్థలో
ఎవరికి వారు ఏకాంతపు కలుగుల మధ్య
ఎవరికి వారైన నాగరికత.
విలయానికి ఎవరికి వారే ప్రతీకలయాక
ఎక్కడ ఈ విలయానికి ముగింపు?





# నాగరికులు

నేను పుట్టినప్పుడు
ఇదే నేల ఇదే ఆకాశం
ఇదే ఆషాఢమాసం
వేళ్ళతో ఇసుక తోడితే
నీటిజల ఉబికి వచ్చేదని
అమ్మ చెప్పేది.
వసంతవాగు పొంగి పొర్లిందట.
దొర్లిదొర్లి పాకినదీ ఈ నేలమీదే
పడుతూ లేస్తూ నడక నేర్చినదీ
ఈ నేలమీదే కదా...
పరుగులు పెడుతూ నదీ ప్రవాహమైనదీ ఈ నేలమీదె.

చిలకపలుకులతోపాటు
చిట్టి కవితలు అల్లుకున్నదీ ఇక్కడే కదా!
మాటలు నేర్చినప్పుడు తెలియదు
ఒక్కో మాటా ఒక్కో మయసభ అనీ
ప్రతి మాటా మంచితనం మేలిముసుగు కప్పుకున్న
వికృత మానవ రూపమనీ
అసలేమిటో అద్దంలో చూసే ఆ రూపేమిటో
పైవాడికే ఎరుక అనీ...

ఇదే ఆకాశం ఇలా కుంచించుకుపోయి
ఎండకు ఎండిపోయిన  ఎండుచేపై



ఏ మూలో దాక్కుంటుందనీ తెలీదు.
నీలాలనింగి ఇలా ఇరుకై
పిడికిట్లో ఒదిగి
మతి భ్రమించిన భ్రమరం అవుతుందని తెలియదు.

ఇప్పుడు ఈ ఆషాఢమాసం
కాలుగాలిన పిల్లిలా పుస్తకాల మధ్య
అక్షరాల మధ్య
ఆకాశమూ లేదు అటు నేలా లేదు
చినుకులు పడితే బురదగుంటలూ
గాలి ఉరి వేసుకున్న ఉక్కిరిబిక్కిరిలో
ఊపిరాడని త్రిశంకు నరకమూ
పెదవులపై నవ్వులు పూసుకు
కళ్ళలో అనుమానాలు వెలిగించుకు
దూరం నుండే పరామర్శించే బక్కచిక్కిన పులులూ.

పెదవులు కదలవు మాటలు పెగలవు
మౌనమే లోలోపల విముక్త రూపాలను
చుట్టూ గోడలపై ఫోకస్ చేస్తుంది.
అయినా నయం కదూ
మనం నాగరీకులం
ఒకరు నిశాచరి
మరొకరు పగటి వల్లరి.

రాత్రంతా పహరాకాస్తున్న
చుక్కలతో మంతనాలు నడిపి

రాలిపడే పున్నాగలనూ
సౌకుమార్యపు పారిజాతాలనూ
రెప్పపాటు కాలం గాలి ఊయల్లూపి
పూవుపూవుకూ చిటికెడు పరిమళం పంచి
వెలుగురేఖల్లో కరిగి విలీనమై
వినిపించని రాగమయే నిశాచరి.

దారి తెలియని ఉషోదయం చటుక్కున
కనురెప్పలపై ఒక ఉల్కలా కుప్పకూలాక
భయం భయంగా కిటికీ అంచుల్లోనో
తలుపు సందుల మధ్యో
వేళ్లు నలిగిన చీకటి
ఉసూరుమంటూ నిట్టూర్పుల జడివానై కురిసాక
నిన్నటి సశేషపు పాటకు కొనసాగింపై
జతపడే తను పగటి వల్లరి.
కప్పుకున్న కల దుప్పటి చెదిరిపోయి
విప్పుకున్న కురుల మధ్య చిక్కుల్లా
జీవన సమరాలు సవాలు విసిరినప్పుడు
సతమతమవుతూనే
రెండు పడవల ప్రయాణం చేసే తానే పగటి వల్లరి.

అయితేనేం
సాయం సంధ్యలో
చీలికలై వేళ్ళాడుతున్న నీరెండల మధ్య
నిశాచరీ పగటి వల్లరీ సమావేశం కదా
ఈ జీవన పరిమళం.




# ఆమే...

ఆమె కళ్ళలో వినిపించని రోదన
పాపం!
ఆమె భుజాలపై శిథిలమైనట్టు
రంగులు వెలసి, మూలపడిన ఒక కుటుంబం
నడకలో మాత్రం ఎక్కడా సడలని వడీ, ఝడీ.
ఏ దూర ప్రాంతం నుండో రావలసిన ఆత్మీయులను
స్వాగతించాలన్న తపన
ఆగిపోయిన బ్రతుకుబండిని లాక్కువెళ్తున్న
క్షణాలు ఓ పక్కన పెట్టి
కాస్సేపు ఏకాంతద్వీపంలా
సేదదీరాలన్న జిగీష.

చిమ్మ చీకటి అర్ధరాత్రి
వెలుగుతున్న మిణుగురు పురుగులా
వెలుగువైపు కదులుతూనే ఉంటుంది.
రెక్కలు తగిలించుకుని
చుక్కల లోకాలు గాలిస్తూనే ఉంటుంది.
ఋతువులను భుజాల కెత్తుకుని
కూనిరాగాలు వినిపిస్తూ
కాలాన్ని కుక్కపిల్లలా వెనకాల తిప్పుకుంటుంది.

ఎప్పటికప్పుడు మొండిబారుతున్న
జీవితపు కొడవలి
రాత్రీ పగలూ ఆకురాయితో పదును పెడుతూ

చిట్టడవి సమయాన్ని చదును చేసుకుంటూ
ప్రతిరోజూ కదిలే మహిషాసురమర్ధిని

విశ్వం అణువణువూ
ఆమె చీర కుచ్చిళ్ళ మధ్య మొహం దాచుకునే
పసిపిల్లల అమ్మ
ఆమె జగజ్జనని
కొంగుచాటునుండి తొంగిచూసే
మనిషి ఆమెకో లెక్కా ....

చిన్నప్పుడెప్పుడూ భయపడింది లేదు
నీడలైనా, గోడలైనా,
పౌరాణిక రూపాలై వెలిసే దేవతలైనా
గోడల మధ్య చీకటి సందు చేసుకుని
ఎప్పటెప్పటినుండో దాక్కుని ఉన్న
తరతరాల ఆత్మలకైనా
చెట్లెక్కి మాట్లాడించే మంత్ర తంత్రాలకూ
ప్లాస్టిక్ రూపాలకు మేకులు దిగగొట్టి
చేసే చేతబడులకూ
ఎన్నడూ భయపడిందే లేదు.

నడివేసవి ఉల్కల్లా రాలిపడే విషప్పురుగులకూ
చీకటికీ వెలుగుకూ మధ్య మిథ్యలా పాకిపోయే
సరీసృపాలకూ
గోరంత చిరుదీపం వెలుగులో
నిద్ర పట్టనివ్వకుండా వణికిస్తున్న చలిపులులకూ



భయపడిందే లేదు.
ఏ ఆకారాలూ నర్తిస్తున్న నిద్రకళ్ళలో
భయాన్ని రగిలించలేదు.
లోలోపలి ఒక కంచుకోట పహరాగా నిలిచిందేమో!

కాని
ఎక్కడ చూసినా నడిరోడ్లు సైతం
ఎర్రెర్రని సముద్రాలవుతుంటే
కనీవినీ ఎరుగని వింతలు
ప్రతిరాత్రీ పీడకలలుగా గోడల మీద నీడలవుతుంటే
ఎంత వెతికి వేసారినా
ఏ మనిషిలోనూ మామిడితోటలూ
మనసు పాటలూ వినిపించక
ఉక్కిబిక్కిరవడం...

గాయపడిన భూగోళం అణువణువూ
రక్తాశ్రువులు స్రవిస్తుంటే
మతిభ్రమించిన జనం వెర్రికేకల మధ్య
కనీవినీ ఎరగని వరద ఒకటి
వెనువెంట సమస్తాన్ని లాక్కుపోతుంటే
మునిగిపోతున్న పడవేమోనని భయంగా ఉంది.
ఎవరికి వారు పక్కవారిని తోసేసి
కాలాన్చే నేలకు బలి అవుతారో
బలి ఇస్తారోనని
భయంగా ఉంది.



# మాట

మౌనంగా ఉన్నంతసేపూ
మాటలు లేనట్టు కాదు
నాలో నేను నాతో నేను ఎడతెరిపి లేకుండా
ఎన్ని మాటలో బలవంతపెట్టి వస తాగించినట్టు
ఒక్కోసారి మాట
గుండె గోడలు దాటి మొరాయిస్తున్న పెదవులను
బెల్లించి మరీ తప్పించుకు వస్తుంది.
కాలం కాస్త లయ తప్పి
ఎగిరొచ్చిన ప్రతి పదమూ పదిలంగా
సీతాకోకచిలుకలా ఎదురుచూస్తున్నట్టనిపించే
విరగబూసిన ఊహల పూమడుల మీద
నిశ్శబ్దంగానే వాలుతాయి.

మాట జారి కిందపడిందా మహా ప్రళయమే కదా
మెరుస్తున్న పాదరసం అరచేతినుండి దొర్లినట్టే
మరిక చేతికి రాదు.
ముక్కలు ముక్కలుగా చెల్లాచెదరై
దుమ్మూ ధూళి కొట్టుకున్న నాలుకలపై పొర్లాడి
ఏ మూలమూలలకు పరుగులు తీస్తుందో
ఏ గుండె పాదాలకు గాజు ముక్కై గుచ్చుకుంటుందో
ఎంత ముచ్చటైన గాజుమందిరమైనా
గురిచూసి విసిరిన మాట ఫెళుసు బారిన ఆయుధమై



పునాదులనుండీ కూల్చి నికృష్టపు పెదవుల మీద
వంకర తిరిగిన విషపు నవ్వుగా మారుతుంది.

అరచేతుల మధ్య అపురూపమైన మెత్తని మాట ఒకటి
సెలయేటి సోయగాలుగా వంపులు తిరిగి
వెన్నతో మలచిన వెన్నెల విగ్రహంలా
హొయలు పులకరిస్తుంది.
నిద్ర గన్నేరులా ఎప్పుడూ సగం మూసిన రెప్పలతో
వెలుగురేఖ ఆనవాలు ఒకటి
మాట వేలట్టుకు వేళ్ళాడుతూ
గతమూ వర్తమానమూ కొలతలు వేస్తుంది.

ఆగి ఒక్కసారి వెనక్కు తిరిగి చూస్తే
మాట బిక్కు బిక్కుమంటూ
ఓ మూలన నక్కి కనబడుతుంది.
సముద్రాలనూ, పూలగుబుర్లనూ
పచ్చిక బయళ్ళనూ, ఋతువులనూ
సమస్తం మేసిన మాట
ఒళ్ళు మరచి మర్యాద తప్పి
తాగుబోతు తప్పటడుగుల్లా
అధికారమో, ఆడంబరమో
ఏదో ఒకటి ఎరవేసిన పెదవుల మీద
మదించిన మత్తేభమవుతుంది.
అందుకే
పల్చని సిల్క్ దారపుపోగు మాటను
ఊపిరి చివరికొసకు ముడివేసుకు
పదిల పరచుకోవాలి గదా!



# నిశ్శబ్దంగానే ఉంటాను

**నే**ను మౌనంగానే ఉంటాను
శూన్యానికి స్వరం లేదు కదా
ఇది కొత్తగా తెలిసినదేమీ కాదు.
సమయం నోరు విప్పిన వేళ
సమస్త ప్రపంచం మూగవోయిన వేళ
నేనూ మౌనంగానే ఉంటాను.
మౌనంగా ఉన్నంత మాత్రాన
అదేదో విచారమో విషాదమో కాదు
నచ్చిన పద పల్లవాలను లోలోపలే ఏర్చికూర్చుకుంటూ
ఎంత సంబరంగా తోరణాల తయారీలో ఉన్నాననీ...

ఇరుగుపొరుగులో, అధినేతలో
జనసమూహాలు సమూహాలు గుంపులు గుంపులుగా
చెవులు హోరెత్తేలా శబ్దాన్ని ఒలకబోస్తూనే ఉన్నారు.
బేరసారాలూ, హక్కులూ అధికారాలూ, అహంకారపు రుసరుసలూ
అమానుషత్వపు ఆక్రోశాలూ, నిందలూ నిష్ఠూరాలూ
శబ్ద విస్తారాకారాలు వెయ్యితలలతో మన చుట్టూనే తిరుగుతాయి.
మనం మౌనంగా ఉంటాం.

అపవాదులూ నిందలూ కలుపుమొక్కల్లా పెరిగి పెరిగి
భూమికి భారమవుతూ సారాన్ని జలగల్లా పీల్చుతాయి
మనం మౌనంగానే ఉంటాం.



ఉట్టి చేతులతో బట్టైనా లేకుండా వచ్చిన సంగతి మరచిపోయి
కనుచూపు సోకిన ప్రతి సజీవ నిర్జీవ సంపదలూ రెండు చేతులతో
రెండు కోట్ల చేతులుగా దోపిడీ చేస్తూ
నష్టాల కష్టాలు కల్మషంగా వర్షించే పెదాలు.
మనం మౌనంగా ఉంటాం.

అలాగని చేతు ముడుచుకు చేతికానివాళ్ళలా కాదు
కథలు కథలుగా చరిత్ర పుటల్లో ఆ మొహాల మీద
పేడనీళ్ళు చల్లుతూనే ఉంటాం.
ప్రతి నిమిషమూ ఒక అస్థిరనిర్ణయ జ్వాలాతోరణమే.
అయినా ఋజువులు లేవు గనక
మనం మౌనంగానే ఉంటాం
మనకూ ఋజువుల అనవసరమే.





# ఏ రోజుకా రోజు

ఏ రోజుకా రోజు
టక్కున నిద్ర కళ్ళ మీద ఉదయం వడ్రంగి పిట్ట
ముక్కుతో పొడిచినట్టు
లేత వెలుగులను జలపాతంలా గుమ్మరించేశాక
ఎంత కావాలనుకుంటే మాత్రం
ఎక్కడి నుండి వస్తుంది మమేకమై పోయే నిద్ర?
హ్ నింపాదిగా దినచర్య ఎప్పటిలానే
పాలూ నీళ్ళూ – బ్రష్, పేస్ట్
ఎక్కడికక్కడ అందుబాటులోనే
ఎదురుచూపుల్లో వేధించే తలపులూ
తలుపు వెనకాల నక్కినట్టు ఆగిపోయిన కన్నీళ్ళూ
ఒళ్ళంతా ఇంకిపోయాక
గెలుపు ఓటముల ప్రసక్తి లేని రొటీన్
చీమ నడకలతో సాగుతుంది.

ఉండి ఉండీ ఏ ఉనికీ లేకుండానే ఒక పరిమళం
వీచినట్టనిపిస్తుంది
ఆ పరిమళం వెంటే పది కాలాల బ్రతుకు సుగంధం
మరోసారి మైపూతగా మారుతుంది
మరోసారి ఇష్టంగా ఆ రోజుల్లోకి నడిచి వెళ్ళి
సావకాశంగా నాలుగు గోడల మధ్యే అయినా
నలభై వసంతాలను కలబోసుకుంటాను.



పూలవనాల మధ్య ఆగిపోయిన క్షణాల్లో
కాలం రెప్పవాల్చి శిల్పమవుతుంది.
చెదిరిన దృశ్యాల మధ్య చలనం లేని శరీరం ఒకటి
నిస్సత్తువగా మారుతుంది.

నింపాదిగానే కాలం చివరంచున ఆగి
గాలివానలూ ఇసుక తుఫానులూ దాటి వచ్చాక
గుమ్మం ముందు నిరీక్షిస్తున్న చెట్టు
నీ ఉనికిని తలపుకు తెస్తుంది
విసిరేసిన చూపుల మధ్య
వివర్ణమైన మొహం ఒకటి బతిమాలుతుంది
కిటికీ అంచున ఒకదాన్నొకటి ఓదార్చుకునే పావురాళ్ళూ
ఖాళీ గూళ్ళను వదిలి దూరతీరాలకు సాగిన చిలకలు వాలని చెట్టూ
నాలాగే కనిపిస్తాయి. ఏ గుండె తడిమి చూసినా చెమ్మగిలే కథలే
ఆపలేని శోకం తడిపి ముద్ద చేస్తున్న మౌన సంభాషణలే.

పచ్చిక బయళ్ళూ, పూలమడూలూ
అయోమయమూ, అస్తవ్యస్తమూ అయిన ఆలోచనలూ
దాటి, కొన్నింటిలో మునిగి తేలి
ఎక్కడికక్కడ ఇష్టాలన్నీ ఇష్టంగా వదిలేసి
వెనక్కు వెళ్ళాలన్న తపన
రాత్రంతా మంచు కురిసిన యావ
దరీదాపూ కాని లోకాలన్నీ చుట్టి వచ్చి
ఏ రోజుకా రోజు
అదే అన్వేషణ.



# స్వప్న సౌందర్యం

ఒక అనాది కాలపు నిజంలాటి స్వప్నం
నిలువెల్లా ఒలికి అణువణువునా ఇంకి
చిరునామా మరచిపోయిన ఉనికి చుట్టూ
ఊటబావిలా ఎప్పటికప్పుడు
ఊరుతూనే ఉంది – ఉన్మత్త మనోహర వసంతాన్ని ఒకదాన్ని
చిలకలు వాలిన చెట్టులా పలుకుల గలగలల మధ్య
ఎన్ని యుగాలు క్షణాలుగా ఎగిరి ఆవిరై
చేతికందని ఒక శూన్య ప్రపంచాన మత్తేభాలుగా కదులుతున్నాయో...
చిలకల పలుకులతోపాటూ కొమ్మల గుసగుసలూ
తలిరాకు రెపరెపలూ తలలు దించుకు
దిగులు పొత్తిళ్లల్లోకి ఒదిగి విశ్రమించాక
నిద్రపట్టక మెత్తటి పరుపు ముళ్ళను గుచ్చుతున్నట్టూ
చల్లని గాలి వేడి వెలుగులను రువ్వుతున్నట్టూ
అస్తవ్యస్తంగా ఆ మూలకూ ఈ మూలకూ
కాలు కదపకుండానే పరుగులు తీస్తూ కూడా
ఆ ఒక్క క్షణం
ఆకాశమంతా కిక్కిరిసిన అదృశ్య దేవతలు
గుప్పిళ్ళకొద్దీ అక్షింతలు చల్లిన క్షణం
సువర్ణాక్షరాలుగా మారిన వరం
చెయ్యేట్టుకు లాగుతూనే ఉంటుంది.



ఎప్పటికప్పుడు తిరిగొచ్చే వసంతం
రోజూ తూర్పున ఉదయిస్తూనే ఉంటుంది
మెత్తని శాటిన్ చీరలాటి చీకటి పొరలనుంచి
కరిగించిన పాలపుంతల నీట్లో మునిగి లేచిన
రవిబింబం అరచేతిన మోస్తూ
సుదీర్ఘమైన వెలుగుదారిన కూడా
స్వప్నాలై వర్షిస్తాయి
మౌనం మనసులను పలవరించినట్టు.





# వసంతానికో దారి

ఇక్కడి నుండి ఒక్కడుగు కూడా కదపను
గుబురుగా పెరిగిన ఈ పూలపొదలను వదిలి
సాయంసంధ్య పేరంటానికి పిలిచి
పసుపూ కుంకాలు పంచుకున్నట్టు
పిలిచి పిలిచి రంగుల మెరుపులన్నీ
అద్దం పడుతూ  ఆకురాలు కాలం
కొంగున కట్టుకున్న హంగులను రాల్చి కొసరి కొసరి
అందాలను విందు చేస్తున్న వేళ
ఒక్కసారైనా కనురెప్పలు వాల్చను
ఒకో రంగుకూ అనంతమైన సోపానాలు
లేలేత ఆరంభం మొదలూ ముదిరిన ముదురు రంగుల వరకూ
ఎన్ని కాంతి సంవత్సరాల ఛాయలు
ఎన్ని వేలవేల సోపానాలు
జాలి పడుతున్న రాలిపడుతున్న
రంగుల పద్మవ్యూహంలో
ఎటు మొదలో ఎటు అంతమో తెలియని
ఉన్మత్త ప్రహసనంలో
గాలి వాలు ఏ వైపునో వేడి ఉనికి ఏ మూలనో తెలియక
అయోమయమై అపహాస్యాలెందుకు
ఒక్క అడుగూ కదపను,
చెట్టునై పాతుకు పోవాలనీ
గుట్టనై ఇక్కడే గట్టులా ఉండాలనీ
సుస్థిరంగానే ఉంది



చెక్కు చెదరని ఊహ
ఇక్కడే కదా ఋతువులు సమావేశమై
ప్రేమలూ పగలూ వగలూ వగైరాలూ చర్చించుకునేది
ఇక్కడే కదా
ఉప్పెనలూ ఉప్పెన తీసిన జీవితాలు
నిశ్శబ్ద ఏకాంతాన గుండె పగిలేలా వాపోయేది
ఇక్కడే కదా
బీడైపోయిన ఎడారుల మధ్య పరిమళాలు
మరకతాల్లా మొలకలెత్తేది
అందుకే
ఉన్నచోటే భూస్థాపితమై
మొక్కనై మొలకెత్తుతాను
వసంతానికో పచ్చని దారిలా
అక్షరమై పరచుకుంటాను.





# ఎక్కడా ఏవీ కనిపించవు

ఎక్కడా ఏ మాత్రం ఆచూకీ  మచ్చుకైనా కనిపించదు.
అణువణువునా అల్లుకుపోయిన మరువపు మొలకలు
లోలోని సౌరభ వీవనలు నడివీధి వరకూ గాలి ప్రవాహాలను
ఏ క్షణమూ మళ్ళించవు.
ఖాళీ గోడలకు చూపులు గుచ్చి
ఏం పెకలిస్తూ ఉన్నానో ఎవరికీ తెలియదు
రాజసం తలఒగ్గని కళ్ళకు అలదుకున్న కాటుక తెర వెనక
అనుక్షణం రాజుకునే ఆవేదన నిప్పుల సెగపై కమిలిపోతున్న
కరిగిపోతున్న సౌకుమార్యపు మెత్తని మనసు ఆనవాళ్ళ జాడలైనా
అలరారే నవ్వుల మధ్య అంతుచిక్కవు.

కాని
చెట్టు చెట్టునా చెక్కిలి మీద చేతులాన్చి చూసే హరిత పత్రాలను
మౌనంగానే ఊపిరి అందని శిల్పాన్నై
చేతులు జోడించి వేడుకున్నా
తీగల్లేని రాయబారాన్ని కొమ్మకొమ్మనూ దాటించి
రహస్యంగా నీకు చేర్చమని.
నిజానికి ప్రపంచమంతా కన్నీటి కడవలను గుమ్మరించి
వీడ్కోలు విషాదగీతాలు పాడినా
ఇక్కడ ఈ గుండెగది శేషతల్ప శయనం మీద
విశ్రమించిన నిన్ను ఎవరైనా ఎక్కడికని పంపగలరు చెప్పు.



పగలంతా గుంపులు గుంపులుగా ఎగిరి వచ్చే మాటలకూ
మనసుకు నచ్చని పరామర్శలకూ చిరాకు చిరాగ్గానే ఉంటుంది.
ఆ చిరాకు వేడికి మైనపుబొమ్మలా కాస్త కాస్త కరుగుతూనే ఉంటాను
ఒంటిస్తంభపు గాజుమేడలా కనిపిస్తానేమో గాని
నా చుట్టూ నువ్వే కంచుకోటవని తెలియక
పోటీ పడి విసరడానికి రాళ్ళు పోగేసుకుంటారు
కొంచెం శాడిజం కొంగున కట్టుకు వచ్చినవాళ్ళు
అచ్చమ్మ బుచ్చమ్మ కథలు గురి చూసి గుడ్డి బాణాల్లా వదులుతారు

అయితేనేం నా చుట్టూ అల్లుకున్న కవచం ఒకటి
మౌనంగానే తిప్పికొడుతుంది అక్షరాలుగా మార్చిన
బూమరాంగ్‌లను.
సాయంసంధ్యకు యుద్ధ విరమణ ఏకపక్షంగా ముగిసాక
ఎక్కడా ఏ మాత్రం అడాపొడా వదలకుండా
అంతఃపురానికి నిష్క్రమించాక
ఒక పూలజల్లు తొలిచినుకై రాలుతుంది.
మూసిన కనురెప్పల వెనక దేహాన్ని వదిలి
రాళ్ళూ ముళ్ళూ లేని ఈ బృందావన సంచారం
ఎవరికీ ఏమీ తెలియదు – కనిపించదు.



# జవాబు లేని ప్రశ్న

నిశ్శబ్దం పోతపోసినట్టు
అక్కడ ఒక ఏకాంత ద్వీపంలో
చిరునామా మరచిపోయి
తనను తాను ఎక్కడో పారేసుకున్న మనిషి
పేరూ ఊరూ ఏమిటని శూన్యతలపోతల్లో
సతమతమవుతూ పైకి మాత్రం
అర్థం పర్థం లేని నవ్వులను మాత్రం అన్నీ తెలిసినట్టు
నువ్వుల్లా వెదజల్లుతూ...

ఉదయపు వెలుగులను కాఫీకప్పులో కలగలిపి
చుక్క చుక్కా చప్పరిస్తూ
మిట్టమధ్యాహ్నపు మసక పొగమంచు
చాపిన అరచేతుల్లో పోగేసుకు
తల పైకెత్తి ఒంటికాలితో
బహురూపాల మధ్య తొక్కుడు బిళ్ళాడుతూ ...

సాయంత్రం టక్కుతూ టారుతూ
ఆగి కాస్సేపు గారాలు పోతూ
అంతలోనే భువన భవనాల మధ్య
గబగబా నాలుగడుగులు వేస్తూ
చూస్తూండగానే చేతులూపేసే నీరెండ వెలుగులతో
దాగుడుమూతలాడుతూ...



పగటివేళలు పల్చని పరధ్యాన్నంలో కరిగించాక
అప్పుడు కదా అగ్నిపరీక్ష
ఎక్కడో తనను తాను చూసుకున్నట్టే ఉంటుంది
అస్పష్టంగా గుర్తున్న అమ్మ లాలిపాటలోనూ
అభం శుభం ఎరుగని పసితనపు నీడల్లోనూ
మనిషితనం ఛాయ మరులుగొలుపుతూనే ఉంటుంది.

ఒక విదిలింపు మత్తులో మునిగి
కాలపరిమితులు చెరిపేసుకు
ఉనికీ ఊరూ మరచిపోయాక
వణుకుతున్న స్వరం
చెదిరిన జ్ఞాపకాల మధ్య
ఊపిరికీ ఉన్మత్తతకూ బెత్తెడు దూరాన
అప్పుడు నిలదీస్తుంది
నిలువెత్తు నిజస్వరూపం –
నువ్వు మనిషివేనా? అంటూ.





# లేనితనం

ఏమీ లేకపోడం ఏమిటో తెలుసా?
మార్గశిరమాసపు మిట్టమధ్యాహ్నం
మంచుసముద్రంలో దూకి లేచి వచ్చినట్టు
నడినెత్తిన దినకరుడు మసకబారి
చలికి వణుకుతూ ముడుచుకుపోయి
వేడి వడగట్టిన వెలుగుల్లో తలదించుకోడం.

చిట్లిన నీటిబొట్టు వెయ్యి శకలాలను మోస్తూ
భుజాలు వంగిపోయిన భారంతో
ఒక పూట ఉపవాసపు దీక్షలో కృశిస్తూ
మరో పూట వెన్నెల విందుల్లో చిందులేసే
చుక్కల మాదిరే
ఉన్ననాడు ఊరంతా పండగ చేసి
లేనప్పుడు కడుపు మాడ్చుకునే
హేమంతాలూ వసంతాలు కదా లేనితనాలు.

మనమే కదా ఒట్టి అమాయకులం
రక్తి కట్టినదల్లా నిజమనీ
రంగరించి పోసిన దివ్యామృతమనీ
నమ్మి దాసోహమనే మనమే
అన్ని నాటకాలకూ కన్నీటి చెరువులమవుతాం
ఆ చెరువులు అమ్ముకుని అందలాలెక్కేవారికి
అడుగులకు మడుగులొత్తుతాం.



మనమే కదా ఒట్టి అమాయకులం
ఏమీ లేని నీలి నీలి ఆకాశాన్ని
వెయ్యిన్నొక్క పాటలుగా పాడుకుంటాం
లేని ఆకాశాన గాజుమేడలు కట్టి
ఆహ్వానించేవారికి ముద్దర్లేసి గెలిపిస్తూ ఉంటాం
ఆ గెలుపే మన ఓటమి అని అస్సలు తెలీదు
గెలిచిన సముద్రంలో ఓడిన ఓటి పడవలమై
ఎక్కడుంటే అక్కడే ఒక జీవనకాలం పయనిస్తాం.

ఇది కాదు గదా ఏమీ లేకపోడం
రాలిన ఆకులన్నీ తాళపత్రాలని తెలియక
చలిమంట వేసుకోడం, గతం స్వగతాన్ని వదిలి
కొత్తపుంతల వెంట ముళ్లపూలను ఏరుకోడం
ఇంటి మలుపులో ఆగి ఒక్క కన్నీటి బొట్టైనా
వీడ్కోలు చెప్పని ఏకాకితనం
దాచుకున్న సాక్ష్యాలను సజీవం చేసుకోలేనితనం
ఇవి కదా ఏమీ లేనితనాలు–లేకితనాలు.



# నువ్వు

మౌనం చిటపటలాడుతూ
బుసలు కొడుతూనే ఉంది
రాజుకుంటున్న కొలిమిలో నిప్పుల చిటపటల్లానే
అప్పుడో ఇప్పుడో ఒక స్వరం
లోలోపలి వెక్కిళ్ళ మధ్య  అనునయంగా
ఉపశమనం అలదుతూనే ఉంది.

నరనరానా కరిగిన నిప్పురవ్వల ప్రవాహంలో
ఉండి ఉండీ ఏ మూలో ఒక కొస
మంటల మూటలు ముడివేసుకు భగ్గుమంటూనే ఉంటుంది.
కాలి గాయాలైన భావాలు చిదిమినట్టు
ఎక్కడి కక్కడ విస్తరిస్తున్న పరితాపం రగులుతూనే పోతుంది.

వీధి వీధినా నలుగురి మధ్యనా
ఎలాటి హెచ్చరికలూ లేకుండానే
ఎన్ని గుండెలకు ఓపెన్ హార్ట్ సర్జరీలో
ప్రతి గుండెలోనూ దాక్కుని ఉన్న అడ్డంకుల జాడ
సుత్తి పోట్ల మాటలతో పక్కటెముకలు విరక్కొట్టి
ఉరఃపంజరం తలుపులు బద్దలు చేసి తెరిస్తే గాని కనబడవు
అక్కడికీ నరాల్లో కలిసిపోయిన విషప్రవాహాల నీలం
ఎవరికి వారికి ఎప్పటికీ తెలియదు.
తీపి మాటల గులాబీ పెదవుల వెనక నికోటిన్ డిపాజిట్లూ



పాలిపోయిన మొహాల వెనక స్విస్ బాంక్ అకౌంట్లూ
కడుపు నిండిన పాముల్లా పడుకునే ఉంటాయి.

మిట్ట మధ్యాహ్నపు ఎండ వేధింపుల మధ్య
ఉప్పునీళ్ళు స్రవిస్తున్న కష్టజీవుల దేహాలు మాత్రం
నాగరికత పంటపొలాల్లో దిష్టిబొమ్మలే అనిపిస్తాయి
కాయలు కాసిన కాళ్ళకూ చేతులకూ
ఓటు ఖరీదొక్కటే దక్కుతుంది
వణుకుతున్న కష్టాలకు తాళం బిగించి
మాట పెగలని మధ్యతరగతి రాబందుల రాజ్యానికి
నిలువెత్తు సాక్ష్యం కదా
అవసరం వస్తే చాలు
సామాన్యుడే  సూర్యుడూ చంద్రుడూ
సామాన్యుడే  దారి చూపే వేగుచుక్కా
ఆ ప్రహసనం ముగిసాక మాత్రం
ఆర్పేసిన కిరసనాయిలు దీపంబుడ్డి.

రేప్పొద్దుటికల్లా
నువ్వులూ నీళ్ళూ వదిలేసిన
సజీవ నిర్జీవి స్వరం నొక్కేసిన బడుగుజీవి.

